40

జనవరి 1973

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక



నిర్వహణ

'సాహితీ మిత్రులు'

1 రు.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

**40**

జనవరి **1973**

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

64 పేజీలు

1 రూపాయి

ముఖచిత్రం: హోచిమిన్ ప్రిజన్ డైరీ నుంచి
సందర్భం: ఖైదీగీతం. (5వ పేజీ చూడండి)

విడిప్రతి: ఒక రూపాయి
అర్ధసంవత్సర చందా: ఆరు రూపాయలు
సంవత్సర చందా: పది రూపాయలు

ప్రతులకు, వివరాలకు :
సృజన
హనుమకొండ
వరంగల్ - 506001

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-506002 (A.P.)

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

1973 జనవరి | మాస పత్రిక | 40



ఈ సంచిక 7వ పేజీలో ప్రారంభం

## ఉప్పెన

జనచైనా రచయిత చౌలి-పో నవలకు

ఎస్. ఎస్. ప్రకాశరావు అనువాదం

# పాలక వర్గం అసత్యాలు×విప్లవ సత్యమూర్తులు

[High above white clouds are chasing black ones away.
On earth a free man is to stay a prisoner ]

పైన తెల్ల మేఘాలు నల్ల మేఘాలను దూరంగా తరుముతున్నవి
భూమ్మీద మాత్రం స్వేచ్ఛా మానవుడు ఖైదీ అయ్యాడు. — హో చి మిన్

సత్యమూర్తి అరెస్టు విషయంలోకూడ అసత్యమే ప్రచారంచేసింది యీ ప్రభుత్వ యంత్రాంగ దమననీతి. అబద్ధంచెప్పే అలవాటును మానుకోలేకనో మరెందువల్లనో ఆయనను ఖమ్మంలో అరెస్టుచేసి హైదరాబాద్‌లో చేసామంటున్నరు పోలీసులు. లోగా మే నెలలో వల్లగుట్ట కొండల్లో 'సంఘర్షణ'లో చనిపోయింది సత్యమూర్తేనని తాటికాయంత అక్షరాలతో ఆకాశమంత వాణితో ప్రచారం చేసిందీ యీ పోలీసుశాఖే. ఇప్పుడు సోదరుడు గుర్తుపట్టి భార్య వితంతువై తమను మోసగించారని దబాయింపు అమాయకత్వాన్ని నటిస్తున్నారు. ప్రజలు నిజం తెలుసుకోవడానికి ప్రభుత్వ యంత్రాంగంమీద విశ్వాసం ఉంచటం ప్రజాస్వామిక లక్షణం ఈ దేశంలో పత్రికా స్వేచ్ఛను కోరే ఝూట్ ప్రెస్ 'నక్సలైట్ల' వార్తలను మాత్రం పూర్తిగా పోలీసు కథల ఆధారంగానే అల్లుతుంది. అసత్యాలను యదార్థ వార్తలుగా నమ్మించలేకపోతే యీ దేశంలో అసలు దౌర్జన్యం ఎవరు చేస్తున్నారో, ఎవరిని కాపాడడానికి రక్షకభటశాఖ వున్నదో ప్రజలు పసిగడుతారు. పోలీసు, రేడియో, గుత్త పత్రికలు సత్యాన్ని మాయ చేయడానికే పుట్టాయని, ఈ కుట్రను చట్టబద్ధం చేయడానికే శాసన సభలు, 'న్యాయ' బద్ధం చేయడానికే కోర్టులున్నాయని ప్రజలు గ్రహిస్తున్నారు. ప్రజల యీ చైతన్య అవగాహనకు శాస్త్రీయ విశ్లేషణను, లక్ష్య సాధనకు సైద్ధాంతిక మార్గాన్ని, స్వప్నాలకు భవిష్యత్తు రూపాన్ని యిచ్చేవాడే యీనాడు మేధావి. పరిష్కారంలో లేకుంటే సమస్యలో వున్నట్లే. తిరుగుబాటులో షరీకులేకపోతే దోపిడీలోవున్నట్లే. అందుకే యీనాడు వామపక్షం వహించినవాడే మేధావి. సత్యమూర్తి అటువంటి భావసాయుధ మేధావి.

'పిలుపు' పత్రిక యిలారాసింది 'సత్యమూర్తి కేవలం రాజకీయవాది మాత్రమే కాదు. కవి. ప్రజాకవి. మరీఖచ్చితంగా నిర్వచించాలంటే విప్లవ కవిత్వానికి ఒరవడి పెట్టిన సాహిత్యమూర్తి. ఒకచేత పెన్ను. మరొకచేత గన్నుతో విప్లవ పోరాటంలో పాల్గొన్న సత్యమూర్తిని ఆదర్శంగా విప్లవ పథగాములైన రచయితలు ప్రజలు పరిగణించి అనుసరించాలి'.

ఈ ప్రభుత్వం, ఏ ప్రభుత్వమైనా సత్యమూర్తిని అరెస్టు చేయగలదేగాని జ్వలిస్తున్న సత్యాన్ని ఎంతకాలం చీకట్లో బంధించగలదు. విప్లవ చైతన్యం ప్రజా సత్యాన్ని ఖైదు నుంచి విడిపించుకుంటుంది.

నీ దేహం జైల్లో
నీ సందేశం బయళ్ళలో అడవుల్లో ప్రజాహృదయాల్లో
ఫలించనున్న మహత్తర లక్ష్యంకోసం
నీ సిద్ధాంతాన్ని యింకా ఉన్నతంగా కాపాడుకో [హోచిమిన్] — సంపాదకుడు

# ఖైదీ గీతం

శివుడు

శత్రుచేజిక్కితినని
వెక్కిరించకు నన్ను
మిత్రద్రోహము చేత
శత్రుచేజిక్కితినే
చందమామా! చందమామా!!

అలసిసొలసినేను
నిదుర పోతుండగా
అన్నదాతే నన్ను ?
వెన్నుపోటు పొడిచే
చందమామా! చందమామా!!

బందిఖానాలోన
ఒంటరిగ ఉన్నాను
నీకె చెప్పుదుగోడు
నీవె నాకుతోడు
చందమామా! చందమామా!!

బెదిరింపు లెన్నయినా
లాలింపు లేవయినా
మనజెండా గౌరవము
నిలిపితిని నిజమమ్మా
చందమామా! చందమామా!!

అష్టకష్టాలతో
నాదేహమే చివికెను
గుండె నిబ్బరమొక్కటే
అండగా నిలిచెను
చందమామా! చందమామా!!

ఆకొకటి రాలినా
చెట్టుమోడే అగునా?
నేనొకడ రాలినా
పోరుశమియించునా?
చందమామా! చందమామా!!

నా మనసులో మాటొకటి
నీ మదిలోన నిలుపుకో
నేనున్న, లేకున్నా
పోరు ఆగదు పొమ్మా!
చందమామా! చందమామా!!

కార్మికులు, కర్షకులు
సాయుధ శ్రేణులకు
నను కడుపులోదాచిన
అమ్మలకు, అన్నలకు
నా గుండె విప్పారిన
దండాలు చెప్పవే
చందమామా! చందమామా!!

ఎంతోదూరము నడిచి
ఎన్నో కోటలు నడిచి
మృత్యువుతో, శత్రువుతో

పోరాటమే సలిపి
చివరికీ ఖైదులో
బందీగా వున్నాను
బంధాలు బిద్దలగు
రోజొకటి వచ్చులే!
చందమామా! చందమామా!!

జీవితాంతమువరకు
ప్రజలకు సేవలుచేయ
విఫలమైనందుకు
నన్ను మన్నించమని
నా మిత్రులను వేడవే
చందమామా! చందమామా!!

కంట తడిపెట్టకే
చందమామా!
కదనాన కన్నీరు
తగదు వినవమ్మా!
విజయమొకనాటికి
కలదు నిజమమ్మా!
చందమామా! చందమామా!!

శత్రువే చిక్కితినని
వెక్కిరించకు నన్ను
శత్రు శిబిరము కైన
ఉగ్ర నరసింహునే
శత్రు శిబిరమునైన
వైప్లవ్య గీతినే
చందమామా! చందమామా!!

[ఖైదులో మొదటి రాత్రి
కటకటాల అవతల ఎదురుగా చందమామ]

---

కఠినమైన పర్వతాలు, అగాధమైన లోయలు పయనించినాక
మైదానంలో అంతకంటె ప్రమాదం జరుగొచ్చని ఎట్లా ఊహించగలను?

అడవిలో పులి ఎదురైనా నాకేంప్రమాదం రాలేదు
మైదానంలో మనుషులమధ్యకురికిన జెయిల్లో తోసిన్రు

నేను ప్రజల ప్రతినిధిని
ప్రధానమైన పనిమీద ప్రయాణం చేస్తున్న
నాకేదో ఆతిథ్యం యిస్తున్నట్లు జైల్లో ఎందుకు తొయ్యాలి.

నేను నిజాయితీ పరుణ్ణి,
నా హృదయాన్ని ఏ కష్టమూ ముక్కలు చెయ్యజాలదు.

[హోచిమిన్ గీతానికి స్వేచ్ఛానుసరణ]




చౌలి - పో

చైనా నవల

హరికేన్ కు

తెలుగు అనువాదం

"కొద్ది కాలంలోనే, చైనాలోని మధ్య, దక్షిణ, ఉత్తర రాష్ట్రాలలో కోట్లాది రైతుకూలీలు ఒక వెల్లువలాగ, తుఫానులాగ లేస్తారు. అసాధారణమైన ప్రచండవేగంతో, తీవ్రతతో వచ్చే ఆ ఉప్పెనను ఏ శక్తి, అది ఎంత గొప్పదైనా సరే, అణచలేదు".

— మావో సె-టుంగ్.

రచయిత గురించి :

చౌలి-పో 1908 లో హూనాన్ రాష్ట్రం ఇయాంగ్‌కౌంటీలోని ఒక గ్రామంలో పుట్టేడు. అతని తండ్రి బడిపంతులు. ఇద్దరు అన్నలున్నారు. ఇద్దరూ రైతులే.

1927 లో స్కూలు చదువు పూర్తయేక దారిద్ర్యంవల్ల పై చదువులకి స్వస్తిచెప్పవలసి వచ్చింది. ఆ పరిస్థితుల్లో పో తన ఊరువదిలి షాంగై వెళ్ళి కార్మికులకి ఉచిత విద్యాబోధన వున్న ఒక యూనివర్సిటీలో చేరేడు. కాని చేరిన ఎనిమిది నెల్లకే అతని విప్లవ భావాలవల్లా, కార్యాచరణవల్లా అతన్ని తిరోగమనభావాలుగల యునివర్సిటీ అధికారులు అక్షదనించి బైటికిపంపేశారు.

తన ఇరవై మూడోఏట ఓ ప్రెస్సులో ప్రూఫ్‌రీడరుగాచేరేడు చౌలి-పో. ప్రెస్సు కార్మికుల సమ్మెలో పాల్గొన్నాడన్న మిషమీద అతన్ని కొమింటాంగ్ పోలీసులు అరెస్టుచేసి రెండున్నర సంవత్సరాలు జైలు శిక్ష విధించేరు.

1934 లో విడుదలయేక చౌలి-పో చైనా వామపక్ష రచయితల సంఘంలోనూ, దరిమిలా చైనా కమ్యూనిస్టుపార్టీలోనూ చేరేడు. ఆ తరవాత అతను చాలా ఉద్యోగాలు చేసేడు. పత్రికలకి సంపాదకుడుగానూ, యుద్ధకాలంలో విలేఖరిగానూ, అనువాదకుడుగానూ, యేనాన్‌లోవున్న లూసన్ ఆర్ట్స్ ఇన్‌స్టిట్యూట్‌లో టీచరుగానూ, ఆ తరవాత అదే సంస్థలో సంపాదక, అనువాదాల శాఖల పెద్దగానూ పనిచేసేడు.

సుప్రసిద్ధమైన పుష్కిన్ డుబ్రవ్‌స్కీ (Dubrovsky) షొలొఖోవ్ బీళ్ళు దున్నేరు (Virginsoil Upturned) వంటి గ్రంథాలు అనువాదం చేయడమేకాక షన్సీ-చహార్-హోపీ సరిహద్దు ప్రాంతంగురించి నా అభిప్రాయాలు (My Impressions of the shansi-Chahar-Hopei Border Region) యుద్ధరంగం డైరీ (Diary at the Front) సోవియట్ యూనియన్‌లో (In the Soviet Union) అనే రచనలు చేసాడు.

1950 స్టాలిన్ బహుమతిపొందిన విముక్తచైనా (Liberated China) అనే ఫిల్ముకు సినేరియో రాయడంలోకూడ చౌలి-పో తోడ్పడ్డాడు.

1946లో భూసంస్కరణల్లో పాల్గొన్నాక ఈ ఉప్పెన (Hurricane) అన్న నవల రాసేడు చౌలి-పో. ఈ నవలకి 1951 లో స్టాలిన్ బహుమతి వచ్చింది.

## ఉప్పెన (The Hurricane) నేనెలా రాసేను?

1946 చలికాలంలో నేను ప్రాగుత్తర చైనాలో ప్రవేశించేప్పటికే భూసంస్కరణలు బాగా జరుగుతున్నాయి. ప్రభుత్వోద్యోగులందర్నీ గ్రామసీమలకి వెళ్ళి రైతాంగాన్ని ఈ ప్రజాఉద్యమంలో ముందుకు నడిపించమని మా కమ్యూనిస్టు పార్టీ ఆదేశించింది. మా కాలంలోగల ప్రధాన వైరుధ్యాలలో, పోరాటాలలో భూస్వాములకీ రైతుకూలీలకీ మధ్యగల వైరుధ్యాలు పోరాటాలుకూడా కలిసేవున్నాయి. అందుకే విప్లవం విజయవంతం కావాలంటే భూసంస్కరణ ఒక కీలకాంశంఅని నేను గ్రహించేను. ఈ అవగాహనా విప్లవంలో పాల్గొనవలసిన బాధ్యతా నన్ను గ్రామసీమలకి తీసుకుపోయేయి. అనాడు మనసా వాచా కర్మణా విప్లవ పోరాటంలోకి దూకడానికి నేను నిశ్చయించుకున్నాను. ఒక నవల రాద్దామన్న వుద్దేశం పుట్టుకు నాకు అప్పటికి లేదు.

భూసంస్కరణలు విజయవంతమయేలా చెయ్యాలంటే వ్యవసాయ కార్మికులతో కలిసి జీవించి, కష్టం సుఖం కలిసి అనుభవించాలే తప్ప మరోలా జరగదు.

అందుచేత మేము అక్కడున్నన్నాళ్లూ ఈ కష్టజీవులేంతింటే అది తిని, వాళ్లతో కలిసి పనిచేసేము. వాళ్ళ తిండి అంటే మరేం కాదు; జొన్న అంబలీ. ఉప్పులో ఉడకేసిన కూరగాయలూను. అంతకన్నా ఒక్క పిసరు మంచి తిండి తినదల్చుకొంటే వాళ్ళనీ ఆ వూరినీ వదిలి వెళ్ళవలసిందే. అంటే జనం నుంచి దూరం కావడమే. పద్నాలుగేళ్లు జపాన్ పరిపాలనలో దారుణమైన దోపిడీకీ, ఘోరహింసలకీ గురైన వాళ్ల బతుకు ఆఖరికి పరమ నికృష్టంగా తయారయింది గడ్డి గాదం తింటూ రోజులు గడుపుతున్నవాళ్లుకూడా అక్కడ వున్నారు పదుహేడు, పద్దెనిమిదేళ్ళ పడుచుపిల్లలు, కట్టుకుండకి గుడ్డ ముక్క లేక యెప్పుడూ అర్ధనగ్నంగానే వుండవలసి వచ్చింది.

మేము వెళ్ళిన కొత్తలో అక్కడ వాళ్లు మమ్మల్ని మొదట నమ్మనూలేదు; అర్థం చేసుకోనూలేదు. మమ్మల్ని, మా జీవిత విధానాన్ని పరీక్షగా చూసేకే కొంత నమ్మసాగేరు. మేమూ వాళ్ళలాగే అతి సామాన్య జీవితాన్ని గడుపుతున్నామనీ ఎంత చెత్త తిండైనా తినడానికి మేము సిద్ధంగా వున్నామనీ తెలుసుకున్నాక మాత్రమే మాకే దురుద్దేశాలూ లేవని నమ్మేరు వాళ్లు. పూర్వం వాళ్ళని నానా హింసలకూ గురిచేసిన పోలీసులు గుర్తుకొస్తారని- మా కాళ్ళకివున్న బూట్లు తీసి అవతల పారేసాం.

మమ్మల్ని మేము ఇట్లామలచుకోడంవల్ల త్వరలోనే రైతాంగం అంతా మమ్మల్ని నమ్మడమే కాదు; ఆ గ్రామంలో మా రక్షణ బాధ్యతకూడా తీసుకున్నారు. రాత్రిళ్లు మేము బయటికివెళ్తే తుపాకులు పట్టుకుని మాకు రక్షణగా వచ్చేవారు రైతులు

రైతు కూలీలతో అంత దగ్గర సంబంధాలు ఏర్పరుచుకున్న తరువాత వాళ్ళు. వాళ్ళ దుర్భరమైన గతాన్ని వాళ్ళ బతుకులోని బాధల్నీ. భూస్వాముల దుర్మార్గాల్నీ. ఆ గ్రామ పరిస్థితుల్నీ. ఎన్నో అంతరాంతరాల్లోని రహస్యాలనీకూడా ఆప్తులకి చెప్పినట్లు మాకు చెప్పసాగేరు. తమను అణచేసి దోపిడీకి గురిచేసిన ద్రోహులు. స్థానికనియంతలు, భూస్వాములు మున్నగు ప్రజాశత్రువులతో మాతో కలిసి పోరాడడానికి తమ సంసిద్ధతని తెలియజేసేరు. పోరాటంలో రాటుదేలిన కొంతమంది కార్యశీలురయిన రైతులు మాతో ఎంతోబాగా కలిసుండేవారు. వ్యవసాయ కార్మికనాయకుడైన హ్వాయు-యంగ్ కొమింటాంగ్ బందిపోట్లతో, గూఢచారులతోపోరాడి తర్వాత అస్వస్థుడై చని పోయేముందు చివరిక్షణంలోకూడ నాగురించి అడిగి తెలుసుకుంటూనేవున్నాడు. అతని స్నేహాన్ని, ఇతర కామ్రేడ్స్ ఆదరాభిమానాలను నేను ఎన్నటికీ మరచిపోలేను.

హెలుంగ్ కియాంగ్ రాష్ట్రంలోని షాంగ్‌చి కౌంటీలో ఆరునెలలపాటు భూసంస్కరణల్లో పాల్గొన్నాను. ఈ బృహత్తర పోరాటదశను ప్రత్యక్షంగా చూడడానికి స్వయంగా ఇతర ప్రాంతాలుకూడ తిరిగేను. హార్బిన్‌కు తిరిగి వచ్చిన తర్వాత యీ సజీవమైన, విలువైన అనుభవాన్ని ఉపయోగించుకొని ఒక నవల రాయాలనుకున్నాను. సామ్రాజ్యవాదానికి భూస్వామ్యవిధానానికి వ్యతిరేకంగా 20 సంవత్సరాలుగా ప్రజలకు నాయకత్వం వహించి మా పార్టీ నడుపుతున్న మహత్తరమైన పోరాటాన్ని. ఈకాలంలో రైతుల సుఖాలను. దుఃఖాలను చిత్రించి మొత్తంగా విప్లవ పరిణామాన్ని ఉత్తేజపరచాలని నా ఆకాంక్ష. ఈ ఆశయం సాధించడానికి మూడు నెలలకాలం వెచ్చించి ఉప్పెన మొదటి భాగాన్ని. తర్వాత ఆరు నెలలు రెండవభాగాన్ని రాసేను.

నేను పత్రికలు చదువగలను కనుక పార్టీ మీటింగులకు హాజరయి, డాక్యుమెంట్లుకూడ పొందగలిగేవాణ్ణి గనుక గ్రామసీమల్లో పనిచేసినంతకాలం భూసంస్కరణ పోరాటంగురించి నాకు ప్రాగుత్తర ప్రాంతానికి సంబంధించినంతవరకు బాగా తెలిసి వుండేది. అంతేకాకుండా ఈ పోరాటానికి సంబంధించిన యిలాంటివే ఎన్నో వాస్తవగాధలు వినివుండడంవల్ల యీ నవలానిర్మాణము పాత్ర చిత్రీకరణ నాకు చాల సులువయింది. ఉప్పెనలో నేను చిత్రించిన సంఘటనలు, పాత్రలు చాలవరకు నిజమైన సంఘటనలమీద వ్యక్తులమీద ఆధారపడి రూపొందించబడినవే. ఉదాహరణకు, రైతు

సంఘ అధ్యక్షుడు చౌయు-లిన్ మరణము, అతని భార్య దుఃఖం, గ్రామస్తుల దుఃఖం, స్మారకసభ అన్నీ వాస్తవ సంఘటనలే. ఒక పూళ్లో వెన్ ఫెంగ్-షాన్‌అనే కమ్యూనిస్టు కార్యకర్త వుండేవాడు. అతన్ని ఒక భూస్వామి హత్యచేసాడు. ఈ సంఘటన మమ్ములను ఎంతో కదిలించింది. అతని వీరమరణము, దానితో రైతుల్లో రగిలిన వర్గకసి, విప్లవ చైతన్యము యీ నవలలో చిత్రిస్తే దానివల్ల మన యువతరం ఉత్తేజితులై, చైతన్యవంతులై మన విప్లవయోధులు తీర్చినబాటల్లో నడుస్తారని ఆ పాత్రను ఈనవలలో తీసుకున్నాను.

రచయిత తననొక గదిలో బంధించుకొని కేవలం ఊహాలోకాల్లోంచేరాయలేడు. ఒకవేళ అట్లాచేస్తే చాల అపహాస్యానికి గురయ్యే తప్పులు చేస్తాడు.

ఈ నవల రాయడంలో దినపత్రికల్లో వార్తల్నీ, పార్టీ డాక్యుమెంట్లు కొన్నింటినీ వినియోగించుకొన్నాను. కళ్లారా చూసిన విషయాలేగాక అక్కడ జనంచెప్పిన కథల్ని కూడా ముడిసరుకుగా వాడుకొన్నాను.

బందిపోట్లతో పోరాటాలగురించి ఈ నవల్లో నేను వర్ణించిన ఘట్టాలు, జనంనాకు చెప్పిన కథల ఆధారంగా రాసినవే. నేనెప్పుడూ స్వయంగా బందిపోట్లతో పోరాడకున్నా కొంతమందిని అరెస్టుచేసి ప్రశ్నించాను. నేను విప్లవ సైన్యంలో పనిచేసాను కనుక నాకు పోరాటంగురించి కొంచెం తెలుసు. నేను సేకరించిన సమాచారము, మిలిట్రీ ఎత్తుగడలగురించి నాకున్న స్వల్ప జ్ఞానము బందిపోట్లతో పోరాటాలు చిత్రించడానికి తోడ్పడ్డాయి. ఈవిధంగా విషయాలు వివరంగా వినడంవల్ల ఇతరుల అనుభవాలు అధ్యయనం చేయడంవల్ల, అవి సరిగా విశ్లేషించి సమీక్షించి, వానిలోకి తన స్వంతఅనుభవాలను జోడించడంవల్ల రచయిత పరోక్ష అనుభవాన్ని ప్రత్యక్ష అనుభవంవలె చిత్రించగలడు. పరోక్ష అనుభవాన్ని చిత్రించేప్పుడు తన జీవితానుభవాన్ని కల్పనాశక్తిని పూర్తిగా వినియోగించుకొని మనం వర్ణించే పాత్రలగురించి, సంఘటనలగురించి చాల జాగ్రత్తగా అలోచించుకోవాలి.

'ఉప్పెన'లో లోపాలులేవనికాదు. కథలో ఉండవలసినంత సంవిధానం లేదు. పాత్రలన్నీ ప్రాతినిధ్యస్వభావంకలవి కావు. కథానిర్మాణానికి సంబంధించని కొన్ని వివరాలు తొలగించలేకపోయాను. మొదట భూసంస్కరణకు సంబంధించిన ప్రతి సంఘటన నవలలో తేవాలనుకున్నాను కాని ఆచరణలో అది అసాధ్యమయింది. ఒక గొప్ప భూసంస్కరణ పోరాటంగురించి ఒక నవల రాస్తున్నపుడు ప్రతి విషయాన్ని జొప్పించాలని ప్రయత్నంచేస్తే ఏ సంఘటనా పాఠకునిపై గాఢమైన ముద్రవేయకపోవచ్చు. ఏ పాత్రా స్పష్టమైన ప్రభావాన్ని కలిగించకపోవచ్చు. ఒకపాత్రను వర్ణించే

ప్పుడు ఒకేరకమయిన ఎంతోమంది లక్షణాలను పరిశీలించి శ్రద్ధగా అధ్యయనంచేసి అందరిలోవున్న సమగ్ర చిత్రాన్ని చేపట్టాలి.

చివరగా. భాషగురించి రెండుముక్కలు చెప్పదల్చుకున్నాను. భాష రచయిత పనిచేసే సాధనం. జనం మాటాడే మాటల్ని రాస్తున్నప్పుడు వాళ్ళ భాషలోనే రాయకపోతే మనకి మిగిలేది అవాస్త విక చిత్రణా, కృతక సంభాషణలూను. జనం మాటాడుకునే భాష సజీవంగానూ, సహజంగానూ. ఎంతో లోతుతోనూ వుంటుంది. వాళ్ళ భాష, వాళ్ళ దైనందిన జీవిత పోరాటాల్లోంచి పుట్టిన భాష.

తినడానికి తిండిలేని నిరుపేద, "మా పొయిలో పిల్లి లేవలేదు"అంటాడు. 'నాది' అన్న పొలంలేని రైతు కూలీ, "మా గుమ్మం అవతల పొలం ఇంకొకళ్ళది"అంటాడు. ఇలాగే ఎన్నో ఉదాహరణలు.

జీవితంనించీ, జీవిత వాస్తవంనించీ పారిపోయిన 'మేధావుల'భాషకన్నా ఎంతో గొప్పది ప్రజల భాష.

చౌలి-పో.

# 1

1946 వ సంవత్సరం జులై నెలలో ఒక ఉదయం.

అప్పుడే తెలతెలవారుతోంది. పచ్చని జొన్న మొక్కలన్నీ సూర్యకాంతిలో బంగారుపూతపూసినట్టు కనబడుతున్నాయి. చిక్కుడు ఆకులమీద మంచుబిందువులు, వేలాది వెండిపూసల్లా మెరుస్తున్నాయి. ఆ రోడ్డుపక్క ఊళ్ళలోనిమట్టి మిద్దెలమీద వంటింటిపొగకి కాకోలు గద్దిపరకలు పల్టీలుకొడుతూ ఎగురుతున్నాయి. అక్కడక్కడా పశువులు పచ్చగడ్డి వెతుక్కుంటూ అలాపోతున్నాయి. సొమ్ములకాపరి కుర్రాడొకడు జీనులేని గుర్రంమీద కాళ్ళు అటూ యిటూ వేలాడేసుకుని కూచున్నాడు. పొలాల్లో పశువులు జొరబడకుండా అప్పుడప్పుడు 'హేయ్, హేయ్' అని అరుస్తూ చేతిలో కమ్చీ ఝుళిపిస్తున్నాడతను.

ఇంతలో అతని వెనకనించి రోడ్డుమీద నాలుగు చక్రాల గుర్రాలబండి ఒకటి రాసాగింది. ఆ బండివాడు గుర్రాలని నానాశాపనార్థాలు పెడుతున్నాడు.

పశువులకాపరి ఒక్కక్షణం తన సొమ్ములమాట మరిచిపోయి వెనక్కి తిరిగి బండినీ బండిలో మనుషుల్నీ చూస్తూ ఉండిపోయేడు. ఇదే మంచి అదునుఅనుకుంది కాకోలు. మందలోని ఓ ఎద్దుకాస్తా అక్కడున్న మొక్కజొన్నచేలోకి జొరబడింది.

"ఓయ్! చూడు చూడు నీ ఎద్దు ఆ చేను ఎలా పాడుచేసేస్తోందో ?!"—బండిలో వున్న వాడెవడో అరిచేడు. సొమ్ముల కుర్రాడు వెంటనే గుర్రంమీద నుంచి కిందికి గెంతి, పరుగుత్తుకుని వెళ్ళి ఆ దొంగ గొడ్డుకి ఒక్కటిచ్చేడు.

నాలుగు గుర్రాలు లాగుతున్న ఆ పెద్దబండి, పరుగులుతీసుకుంటూ గ్రామాన్ని దాటి గ్రామం * అలా వెళ్ళిపోతోంది. బండివాడు కొరడాని గాలిలో ఝుళిపించి శబ్దం చేస్తున్నాడు. పాములాగా చుట్టుకొని మళ్ళా విడిపోతోంది కొరడా. బండివెళుతూవుంటే రోడ్డుపక్క పచ్చగడ్డిమీదా, పొలాలమీదా, టెలిగ్రాఫ్ స్తంబాలమీదా బురద తుళ్ళిపడుతోంది. చాలాదూరం పోయేక అలిసినట్టున్నాయి, బుసలుకొడుతూ వేగం తగ్గించేయి గుర్రాలు.

---

* ఈశాన్యచైనాలో హౌలుంకి యాంగ్ రాష్టంలో హార్బిన్‌కి తూర్పుదిశగా వున్న రహదారిమీద పోతోంది ఆ బండి.

"ఈ నాలుగడుగులకీ అప్పుడే మీకు అలుపు వచ్చిందంటే?" అంటూ గొణుక్కున్నాడు బండివాడు. అతనిపేరు 'ఓల్డ్‌సన్'.

"తిండిమాత్రం మస్తుగా, పుష్టిగాకావాల! మామూలుగడ్డీ గాదరా– ఉహుఁ!– మీకు సొక్కవే! సిక్కుడు అచ్చులు కావాల! పనికాడికి వచ్చేసరికి మాత్రం మీకు తెగులట్టుకుంటిగదా? సెప్తానుండండి మీపని....". ఇన్నిమాటలైతే అంటున్నాడు కానీ, కొరడాకొన ఒక్కసారీ గాలిలోంచి కిందికి దిగలేదు. పైకి ఎన్నిమాటలన్నా, తమ యజమానిది వెన్నలాంటి మనసన్నసంగతి గుర్రాలకి బాగాతెలుసు నిజానికి ఓల్డ్‌సన్‌కి తన గుర్రాలు అలిసిపోయేయని తెలుసు. కొంతసేపు వాటిని మెల్లగా వెళ్ళనిద్దామనే అతనూ అనుకుంటున్నాడు.... ఇకనేం? గుర్రాలు అలసట తీర్చుకుంటూ పెళ్ళినడకలు మొదలెట్టేయి.

ఓల్డ్‌సన్ వెనక్కి తిరిగి చూసేడు. బండిలో పదిహేనుమంది కిక్కిరిసిపోయి యెలాగో కూర్చున్నారు. వాళ్లంతా యూనిఫారాలు వేసుకొని, తుపాకులు పట్టుకొని వున్నారు.

'ఏ సైనికదళపోళ్ళో ఈళ్లు?' అనుకొన్నాడు ఓల్డ్‌సన్. 'ఇంతకీ ఈళ్లు మనూరికి ఎందుకొస్తన్నరో?' అదీ అతనికి తెలీదు. వాళ్లు ఎవరైతేనేం? ఎందుకొస్తేనేం?.... తనబండి కిరాయి తనకిచ్చేస్తారు. అదీ అసలు విషయం.

ఆ ముందురోజు అమ్మకంకోసం పట్నానికి వంటచెరుకు తీసుకువెళ్లేడు ఓల్డ్‌సన్. రాత్రికి ఓ చిన్న సత్రివులో పడుకునివుంటే, 'రేప్పొద్దున్నే ఓ పదిహేను మందిని యువాన్‌మావో గ్రామానికి తీసుకువెళతావా' అని ఎవరో బేరమాడేరు. ఖాళీ బండితో యింటికి తిరిగిపోయేవాడికి బేరం తగలడం అంటే మాటలా? మంచి అదృష్టంకిందే లెక్క. ఓ చుక్క వేసుకుని మజాచెయ్యడానికి డబ్బులు దొరుకుతాయి.

ఉన్నట్టుండి బండికాస్తా బురదలో కూరుకుపోయింది. గుర్రాలని తిట్టుకొంటూ కిందికి గెంతేడు ఓల్డ్‌సన్. ఇరుసుల్దాకా బురదలో దిగబడిపోయేయి చక్రాలు ఒక్క నిట్టూర్పు వదిలి మళ్ళీ బండిఎక్కి గుర్రాలని బాదసాగేడు, బండిలో జనమంతా కిందికి దిగి తొయ్యడం మొదలెట్టేరు.

సరిగ్గా అదేసమయంలో వెనకనించి, నాలుగ్గుర్రాల రబ్బరుటైర్ల బండి ఒకటి దూసుకొంటూ వస్తోంది. బురదలో కూరుకుపోయిన ఓల్డ్‌సన్ బండినిచూసి, తన బండిని అపక్కనించీ వేగంగా పోనిచ్చేడు– రబ్బరుటైర్ల బండివాడు. బురద విచ్చలవిడిగా కాదు, విఎరీ తంగా చిమ్మింది. ఓల్డ్‌సన్ ముఖం, చేతులూ, బట్టలూ అన్నీ బురదమయం అయి

పోయేయి. వెనక్కి తిరిగిచూస్తూ వెకిలినవ్వొకటి నవ్వి విజయగర్వంతో ముందుకు పోయేడు ఆ బండివాడు.

చొక్కాతో ముఖం తుడుచుకొంటూ, "కల్లెక్కడ నచ్చేయిరా, నా కొడకా!" అంటూ గొణుక్కున్నాడు ఓల్డ్సన్.

"ఆ బండి ఎవరిది?" అని అడిగేడు బండిలోని ఒకతను. ఆ అడిగినతను బలంగా, ఆకర్షణీయంగా వున్నాడు. మహావుంటే ఓ ముప్పైఏళ్లుంటాయతనికి.

ఓల్డ్సన్ అతన్ని వెంటనే పోల్చేసేడు. అతను ఆ దళం నాయకుడు సియావో. మొన్నరోజు రాత్రి బండిబేరంకోసం తన దగ్గరికి వచ్చింది అతనే.

ఎందుకోగాని ఓల్డ్సన్ సూటిగా సమాధానం చెప్పలేదు.

"ఇంకెవడికుంటాయి బాబూ, అంతమంచి బల్లు? ఆ గుర్రాల్ని సూసేరా, పుష్టిగా ఎలాగున్నాయో? అయి దౌడుతీస్తావుంటే, గిట్టలు బూఁవిని అనవు!" అన్నాడు.

"ఆ బండి ఎవరిది?" మళ్ళీఅడిగేడు సియావో.

ఆ అడగడంలోని ఆతృతని గమనించినట్టుంది; చెప్పడానికి ఇష్టపడలేదు, ఓల్డ్సన్.

ఇక చెప్పడని తెల్సిపోయింది సియావోకి. అందుకే మాటమార్చి, బండిని బురదలోంచి బైటికి లాగడానికి మళ్ళీ మరోమారు ప్రయత్నించమన్నాడు. ఓల్డ్సన్ కొరడా తీసుకొని ముందున్న గుర్రాన్ని బాదడం మొదలెట్టేడు. బండి దిగినవాళ్ళంతా పైకి లాగసాగేరు. ఆఖరికి, ఎలాగైతేనేం బండి బయటపడింది.

"ఏఁవోయ్ ఓల్డ్సన్! నాకు తెలియక అడుగుతాను, నువ్వు ఆ ముందుగుర్రాన్నే ఎందుకలా బాదుతున్నావు? న్యాయమేనా?"అని అడిగేడు సియావో.

"పుష్టిగున్నందుకు దాన్ని తిట్టండిగాని, నన్ను తిట్టకండిబాబూ!" అన్నాడు ఓల్డ్సన్. ఇందాకా చిమ్మిన బురద అతని నుదుటిముడుతలమీద యింకావుంది.

"అయితే, మంచి గుర్రాలనే ఎక్కువదెబ్బలు కొట్టాలంటావ్?"

"ఇదిగిలాగ ఇనుబాబూ! బండి బురదలో దిగడిపోనాదనుకో. పుష్టిగున్న గుర్రాన్ని బాదపోపైతే, నువ్వు బైటికి రానేవు. మూడుగుర్రాల బలంతో అది నిన్నూ నీ బండినీ లాగేస్తాది. 'నస్తినో'మనున్న గుర్రాన్ని బాదేవనుకో, నీపని ఆ పొద్దంతా బురదలో కూకోడఁవే! పెతీయాపారానికీ కిటుకులుంటాయి. మా బండోల్ల కిటుకులియి. పెమాణపూర్తిగా సెప్తన్నానుబాబూ, మా వూళ్ళో నాలుగొందల గడపుంది గాని నాలాటి జటకావోడుమాత్రిం మీకు మరోడు దొరకడు."

"ఎన్నాళ్ళనించీ నువ్వు బండితోల్తున్నావు?" అని అడిగేడు సియావో.

ఈ పొద్దుకి ఇరవై ఎనిమిది సంవత్సరాలౌతాది బాబూ! అయితేటి? ఇన్నాల్లూ నాను ఇంకోల్లబండే తోల్తన్నాను" అని ఓ క్షణం ఆగేడు ఓల్డ్‌సన్.

ఎడంకన్ను చిట్లించి రోడ్డు చివరిదాకా చూసేడతను. కనుచూపుమేరలో ఎక్కడా గతుకులూ గట్రాలేవు. రోడ్డంతా సాఫీగావుంది అలసటతీర్చుకోవచ్చని బండి నిదానంగా పోనిచ్చేడు ఓల్డ్‌సన్. ఏమనుకున్నాడో ఏమో బండిలోవాళ్ళకి తనకథ చెప్పసాగేడు.

1941 నాటిమాట. ఆరోజుల్లోనే ఓల్డ్‌సన్ బండితోలడంమాని, వ్యవసాయంలోకి దిగేడు. ఓ ఎనిమిదెకరాల పోరంబోకువుంటే దాన్ని బాగుచేసి సాగులోకితెచ్చేడు అదృష్టంబావుంది; కార్తీక పున్నానికల్లా ఏభైపుట్ల జొన్న పండింది, అతనిపట్లో రెండు గాదెలూ పూర్తిగా నిండిపోయేయి, 'మంచిరోజులువచ్చేయి; నా అదృష్టం పండింద'నుకున్నాడు. అంతే! ఆ ఆనందం ఎన్నాళ్ళో నిలువలేదు. సరిగ్గా ఆ రోజుల్లోనే ఓల్డ్‌సన్‌కి విషజ్వరంవచ్చి, మంచం ఎక్కించింది. మందుకీ, మాకుకీ బోలెడు డబ్బు ఖర్చయిపోయింది. తిండిగింజలవన్నీ అనీ, మరేదో పన్ననీ వాటికోకొంత ఊడ్చుకుపోయింది. ఇవన్నీ చాలవన్నట్టు, అతను మంచంలో పడివున్న రోజుల్లోనే, జపాన్ సైన్యంవచ్చి భూమిలాక్కుంది. సరి! జబ్బునుంచి బైటపడేసరికి యథాప్రకారం "దండంబుంగొని, స్యందనంబు ..." తోలుకోడం మిగిలింది ఓల్డ్‌సన్‌కి!

"బాబూ! కొందరు కొందరు మంచి నచ్చిత్తరంలో పుడతారు బాబూ! అలాంటోల్లకి పట్టిందల్లా బంగారం అవుతాది. నాకుతెలుసుబాబూ, నానుమాత్రం మంచి నచ్చిత్తరంలో పుట్టనేదు. నేకపోతే ఏటి? అలాల కస్టపడి, సేఁవటోడ్ని పండించేను బంగారం నాటిపంట! ఇంకా శీతకాలం పూరా ఎల్లిలేదు; గింజలుమాత్రం ఎల్లిపోనాయి. అంతా అదురుస్టం బాబూ! ఇదంతా సూసీసరికి నాకు గుండెలు జారిపోనాయి. ఆ ఏడే బందిపోటు నాయాల్లుకూడా దిగి, మిగిలిన గింజలేటి, కట్టుకున్న గుడ్డముక్కలేటి, ఆ కారువుకు పక్కబట్టలుకూడా లాక్కుపోనారుబాబూ! తినిందికి తిండినేక, కట్టుకుందికి గుడ్డముక్కనేక మిగిలిపోనాన్నేను. అయితేటి? అంత సీకట్లోనూ సిన్న ఎలుగురేక నేకపోనేదు. అప్పుడే దళపోల్ను* వచ్చి బందిపోట్లని తరిఁవీసినారు. దాన్యంకొట్లని తెరిపించి తిండికి మలమలలాడిపోతన్న జనాలందరికీ— దాన్యఁవేటి? బియ్యఁవేటి?— ఏది పడితే అది పంచీసినారు. నామట్టుకు నాకు ఓ పుట్టెడు గింజలు దొరికినాయి. బాబూ, పెద్దలు సెప్పనేదా. కస్టాలు కలకాలం నిలవ్వని! వారోసినాడు సీరాయ్యుడా బాబూ?

* 359 బ్రిగేడ్‌లో 3వ బెటాలియన్‌కి చెందిన 8వ దళసైన్యం (eighth route army)

అయితేటి? మాకు దనదాన్య సమురుద్ధిగుందని నాననడంనేదు. ఆకలిసావులు సావడం లేదంటన్నాను. ఏదో మొత్తానికి బండి లాగించేస్తన్నాం. ఏటంటావు? అవునంటావా? కాదంటావా? ... ఓప్! ఓ!! ఎకెల్తన్నారే ఎర్రిముండల్లారా!!" మళ్లా గుర్రాలని తిట్టసాగేడు ఓల్డ్‌సన్.

"పిల్లలున్నారా నీకు?" సియావో అడిగేడు.

ముసిముసి నవ్వులు నవ్వుకొని "బండోడికి పిల్లలేటిబాబూ!"అన్నాడు బండివాడు.

"అదేఁవిటి? ఎందుకుండ కూడదు?"

కొరడాని ఓసారి గాలిలో ఝళిపించి, ఎందుకుండ కూడదో చెప్పేడు ఓల్సన్ "మంచి జంతువుల్ని బాదుతానుకదా బాబూ! నాకు మంచి గుండెనేదు—మరి పిల్లలెలా గుంటారు?"

"నీభార్యకు వయసెంత వుంటుంది?" ఈసారి అడిగినవాడు ఆ బండిలో వాళ్ళం దరిలోకి చిన్నవాడు. అంతా అతన్ని 'చిన్నవాంగ్' అని పిలుస్తారు.

"నలభై తొమ్మిది" అన్నాడు ఓల్డ్‌సన్.

పెకిలి నవ్వొకటి నవ్వి, "నలభై తొమ్మిదేకదా! ఫరవాలేదు. బెంగపెట్టుకోకు. మీ ఆవిడ నీకింకా పిల్లల్ని కనగలదు. ఆ మాటకొస్తే ఎనభై ఎనిమిదేళ్ళయినా పెద్ద ఆలస్యం కింద లెక్కరాదు." అన్నాడు చిన్న వాంగ్.

బండిలో వాళ్ళంతా పగలబడి నవ్వసాగేరు. ఓల్డ్‌సన్‌కూడా వాళ్ళతో నవ్వు కలిపేడు.

తన ప్రతిభ చూపించాలనుకున్నాడు కాబోలు, బండి వేగాన్ని విపరీతంగా పెంచేడు ఓల్డ్‌సన్. గాలిలో తేలిపోతున్నట్టుగా పోతోంది బండి. అతను ఎటు చెప్తే అటు తిరుగుతున్నాయి గుర్రాలు. నదిమీద పడవవాళ్ళు ఎలా నడిపిస్తారో అంత చాక చక్యంతో నడిపిస్తున్నాడు బండి.

కొంత దూరం పోయాక, రోడ్డుకి దూరంగావున్న ఎర్రటి ఇటికల భవనాన్ని చూపిస్తూ ఇలా చెప్పేడు ఓల్డ్‌సన్:

"అల్లదిగో, ఆ బిల్డింగు కనబడ్డంనేదా బాబూ! అందులోనే జపాను మిల్ట్రీ వోల్లుండేవోరు. ఏడాదౌతాది.* కాలీసేసీపి ఎలిపోనారు. అల్లని అలా ఎల్లనిచ్చి, సుట్టుపక్కల వూల్లనించి మైల్లకి మైల్లు నడుసుకుని మరీ వచ్చేసినారు జనం. ఎందుకు?

* 1945 ఆగస్టు 15 న.

ఆల్లొగ్గేసిన బిల్డింగులో ఏఁవుంటే ఆదొట్టుకు పోనానికి. "నువ్వుకూడా ఎల్లరాదా?" అంది మా ఇంటిది. "నా జాతకంలో అదృష్టం నేదే! నా సేతలో బంగారఁ వెడితే, మరో నిమసానికి అది బుగ్గయి కూసుంటాదే! నా నెల్లను"అన్నాను నేను ఓ రోజు మా ఇరుగూపొరుగునున్నోళ్లు గుర్రాలేటి, తుపాకులేటి, బట్టలేటి— ఏయి దొరికితే అయి ఒట్టుకొచ్చేరు. మాయావిడ ఆల్లని సూసింది. "దరిద్రిగొట్టాదా! ఇనాగ సలి తోనూ, ఆకల్తోనూ సావు. నీకు అదే సాస్తి. నీతో బతకడం కన్న సావు నయం. అందరూ దీపంవుండగానే ఇల్లు సక్కెట్టుకుంటావుంటే, నచ్చిత్రాల్ని తిట్టుకుంటా ఇంటో కూకుంటావు నువ్వు?" అంది. "ఓలె! తొందరపడి మాటలనకే! రెండు రోజులాగి సూడు సంబరం!" అన్నాను నాను ...అన్నంతా అయింది బాబూ రెండోరాలు అయి నాయో నేదో,- 'జపాన్ సిపాయీలు వొగ్గేసిన సరుకంతా తీసుకుండికి నాకు కొమింటాంగ్ పెబుత్వం కొణించి అడ్డరొచ్చింది'- అంటూ ఒచ్చేసినాడు హాన్‌బాబు * రావడం అలా గిలాగ రానేదు. తుపాకులూ, శేపాటి కర్రిలూ ఒట్టుకున్న మనుషుల్ని ఎంటేసుకుని మరీ వొచ్చినాడు. మంచిగా తిరిగిచ్చేసినోల్లని ఒగ్గేసినారుగాని, ఇవ్వఁవని మొండికేసి నోల్లనందర్ని నాక్కెల్లి, హాన్ ఇంటికాడ స్తంబాలకి రెక్కలిరిసికట్టి, పులుసులోకి ఎఁవికలేకుండా కుల్లబొడిసీసినారు. గుర్రాలేటి, తుపాకులేటి, బట్టలు గిట్టలు, కండలు మండలు, కంబాలు గింబాలు- అన్నీ హాన్‌బాబే తోలుకుపోనాడు. "నానారోజు ఏటి సెప్పేను? ఈ పొద్దు జరిగిందేటి? సూసేవా?"అని అడిగేను మా ముసిల్దాన్ని. ఏటంటాది? ఒల్లకూరుకున్నాది. ఆడోల్లంతా అంతే బాబూ! అక్కడికక్కడ సూసేగాని, ముందు సూపు ఒక్కర్తికీ ఆనదు" ఓల్డ్‌సన్ ఒక్క షణం ఆగేడు.

"హాన్ ఎవరు?" సియావో అడిగేడు.

"మా వూళ్ళో పెద్ద బుగత బాబూ!"

"ఎలా వుంటాడతను!"

బండి ముసలాడు అటూఇటూ చూసేడు. చూసి, ఊరుకున్నాడు. సియావో, బండివాడి ముఖ కవళికలు గమనించి, చెప్పమని ప్రోత్సహించేడు.

"నువ్వెవరికి భయపడుతున్నావు? మేఁవంతా భూసంస్కరణలు అమలు చెయ్యడానికి వచ్చినవాళ్ళం చెప్పు భయం లేదు" అన్నాడు సియావో.

"ఏటీ! బయఁవా? నాకెవడన్నా బయం లేదండోయ్! నాకేది తోస్తే అది సెప్తాను....హాన్ గురించేనా నువ్వడిగింది?.... ఓ మోస్తరుగా వుంటాడు"

* ఆరోనెంబరు హాన్ అని ఇతన్ని పిలుస్తారు.

రోడ్డుపక్కనున్న పొలాల్నీ, చెరువుల్నీ చూపిస్తూ బందిపోట్లు వాటినెలా నాశనం చేసేరో చెప్పేడు ఓల్డ్ సన్.

ఈసారి హాన్ గురించి అడక్కుండా సంభాషణని బందిపోట్ల వేపు మళ్ళించేడు సియావో

"మీ వూరు మీదికి బందిపోట్లు దండెత్తేరన్నావుకదూ?" అన్నాడు సియావో.

"అవును బాబూ, అన్నాను. కిందటినెల్లోనే రెండు తడవలు ఒచ్చినారు. పగటిపూట ఎక్కడుండీ వారో ఏఁవో, రాత్రియీసరికి మాత్రం వూరిమీద పడీవోరు. ఆడోల్లని బాబూ, గుడ్డలిప్పదీయించి ఎదురూగ్గా నిలబెట్టి, తనివిదీరా సూసీ వోరు.... లంజికొడుకులు!"

"వాళ్ళ నాయకుడెవడో తెలుసా?"

"లియునో-ఫీ బాబూ ఆడిపేరు"

"ఇంకెవరెవరున్నారు?"

"ఏఁవో, నాకు తెల్దు" అని వూరుకున్నాడు బండివాడు. అంతకన్నా ఎక్కువ చెప్పడం అతనికి ఇష్టంలేదని సియావోకి అర్ధమయింది. ముసలాళ్ళెప్పుడూ ఇంతే. ఏం చెప్తే ఏం కొంప మునిగిపోతుందో అన్నట్టుంటారు.

రోడ్డుకి రెండు వేపులా వున్న పొలాల్ని చూసేడు సియావో. అంతటా శ్రద్ధ లేకుండా వదిలేశం కనిపిస్తోంది. మొక్కజొన్న ఇంకా పూర్తిగా కంకులు వెయ్యనేలేదు; అప్పుడే పాలిపోయినట్టున్నాయి. గోధుమ పంటంతా పిచ్చి మొక్కల మధ్యని కప్పడి పోయింది. కుందేలొకటి గడ్డి గుబురుల్లోంచి గెంతుతూ కనబడింది. చిన్నవాంగ్ వెంటనే తుపాకీ తీసేడు—

"ఢాం! ఢాం!!"

బండివాడు గాభరాపడిపోయేడు బండి మీంచి కిందికి గెంతీసేడు. చిన్నవాడు మరో గుండు పేల్చబోతూవుంటే సియావో అతన్ని వారించేడు.

"గుళ్ళన్నీ ఎందుకలా వృధాచేస్తావు? వాటి అవసరం ముందు ముందు ఎంతో వుంది" అన్నాడు సియావో.

రైఫిల్ని యథాస్థానంలో వుంచేడు వాంగ్. ఓల్డ్ సన్ బండి ఎక్కి, మళ్ళీ నెమ్మదిగా నడపసాగేడు. ఓ చోట* బండిని ఆపి, గుర్రానికి దాణావేసి, ఓ చుట్ట

* ఆచోటు పేరు 'యాంగ్ ఛి యూటీన్'

ముట్టించుకొని మళ్ళీ రోడ్డెక్కేడు.

ఇప్పుడు బండిలో వాళ్ళంతా మాట్లాడ్డం మానేసేరు. అలాగని కునికిపాట్లూ పడడంలేదు.

ఓల్డ్‌సన్ మాత్రం, యువాన్‌మావో నించి పట్నానికి పోతున్న బండివాళ్ళ మీద ఛలోక్తులు విసురుతూనే వున్నాడు. బండిలో ఉన్నవాళ్లలో కొంచెం చిన్నవాళ్ళంతా పాటలు[1] పాడడం మొదలుపెట్టేరు.

వాళ్ళ నాయకుడు సియావో మాత్రం ఎవరితోనూ మాటాడకుండా తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. రైల్వేపనివాళ్ళక్లబ్బులో కామ్రేడ్ లిన్ పియావోచేసిన ప్రసంగాన్నీ[2] పార్టీ ఆదేశాల్నీ[3] మననం చేసుకుంటున్నాడతను. ఆ ముందురోజు పార్టీ సమావేశంలో మిత్రులువేసిన ప్రశ్నలూ, వాళ్ళ వాదోపవాదాలూ– అన్నీ అతనికి గుర్తుకొస్తున్నాయి.

'....ప్రజల్ని విప్లవోన్ముఖుల్నిచేసి, వాళ్ళని కూడగట్టకుండా మనం ఏ పనిచేసినా అది విజయవంతంకాదు. వందలాది సంవత్సరాలుగా పాతుకుపోయిన ఈ భూస్వామ్య వ్యవస్థని కూకటివేళ్ళతో పెకలించాలంటే– జనం పెద్ద ఉప్పెనలాగా లేవాలి. ఇదంతా మాటలతో జరిగేపని కాదు. జనాన్ని కదిలించకుండా, ఏవో అర్థంలేని భయాలుపెట్టుకొని, ప్రజలశక్తిని తక్కువగా అంచనా వెయ్యడం మంచిదికాదు ...'–చాంగ్[4] చెప్పిన ఈ విషయాల్తో సియావో పూర్తిగా ఏకీభవిస్తాడు. ఇప్పుడతని ముందున్న ప్రశ్న ఒక్కటే– యువాన్ మావోలో మనం ఏం చెయ్యాలి? జనాన్ని ఎలా కూడగట్టాలి? ఆలోచిస్తున్నవాడల్లా, బండివాడి అరుపులకి ఉలిక్కిపడ్డాడు.

"నిముసంలో అక్కడుంటాం! అల్లదిగో వల్లిగా ఇళ్లు కనబడ్డంలేదా? అదే యువాన్ మావో."

తలెత్తి చూసేడు నాయకుడు.

పచ్చటి చెట్లూ, వాటి మధ్యలో వరుసలో మట్టిరంగు ఇళ్లూ, వాటికవతల నగం మంచుతో ఓ కొండా కనబడ్డాయి. వాళ్లు పనిచెయ్యవలసిన స్థలం అదే!

---

1 'తెల్లవెంట్రుకల చిన్నపిల్ల'అన్న సంగీత నాటకంలోని పాటలు.

2 హార్బిన్‌లో లిన్‌పియావో ప్రసంగించాడు. 1946-49 విముక్తిపోరాటంలో అతని నాయకత్వంలోని దళాలే, ఈశాన్య చైనాని విముక్తి చేసేయి.

3 "దున్నేవాడిదేభూమి"అన్న ఆశయసిద్ధి కోసం, 1946 లో మే నాలుగుని చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ యిచ్చిన ఆదేశాలు.

4 Political Commissar Chang.

పశ్చిమ ద్వారంలోంచి గ్రామంలోకి ప్రవేశించింది బండి.

రోడ్డుమీద అక్కడక్కడా— పూర్వం దళసైనికులు * చేసుకున్న యేర్పాట్లూ అవీ ఇప్పటికీ కనిపిస్తూనే వున్నాయి.

పొడుగు మెడా. ఆ మెడమీద చిన్న తలకాయా వున్నవాడొకడు వీధిలో flapjacks అమ్ముతున్నాడు. ఊళ్లోకి కొత్తగా వచ్చిన వాళ్ళని చూడగానే, పరిగెత్తు కుంటూవచ్చి బండివాణ్ణి అడిగేడు.

"వీళ్లెవరు? పట్నం నించి వచ్చేరా?"

అవునన్నట్టు తల ఆడించేడు ఓల్సన్. పొడుగు మెడవాడు మెల్లగా జారు కున్నాడు. ఆ వీధిమలుపు తిరిగి అక్కణ్ణించి పరుగందుకున్నాడు. నల్లగా, ఎత్తుగా, బలంగా వున్న ఒక ద్వారం దగ్గరికివెళ్ళి, ఆ తలుపుకివున్న మరో చిన్న తలుపు తెరిచి అందులో దూరేడు వాడు. వాడి వింత ప్రవర్తన సియావో కళ్ళలో పడకపోలేదు

ఆ ద్వారం నాలుగు స్తంభాల పందిరిలాగ వుంది. నాగేంద్రుడి (బొమ్మ) అంచు లున్నాయి దానికి. ఆ తలుపులు ఉక్కు తలుపుల్లాగ బలంగా, దృఢంగా వుండడమే కాకుండా, వాటికి ఇంతేసి ఇనపమేకులు దిగేసి వున్నాయి. పొలాల మధ్యని వుందా భవంతి. దాని ఎత్తయిన గోడలచుట్టూ— పెద్ద కందకం, బోలెడు చెట్లూ వున్నాయి. ఆ గోడకి నాలుగు మూలలా నాలుగు గోపురాలున్నాయి. తుపాకుల్తో గురి చూడ్డానికి ఆ గోపురాలకి కొరునల్లని కన్నాలున్నాయి. ఆ కన్నాలు రాక్షసుడి కళ్లలా వున్నాయి. ఆ గ్రామంలో పూరిపాకల్నీ, దారినిపోయే బళ్ళనీ, గుర్రాల్నీ, అందర్నీ, అన్నిట్నీ పరమ భయంకరంగా చూస్తున్నట్టున్నాయి ఆ కన్నాల కళ్లు.

తీసిన చిన్న తలుపుని పొడుగు మెడవాడు మళ్ళీ మూయలేదు అందులోంచి ఆ భవనం, భవనం ముందున్న ఖాళీజాగా కనిపిస్తున్నాయి. ఆ భవంతి ఉత్తరభాగంలో పెంకుటి వాసవుంది. ఎండకి దాని కిటికీ అద్దాలు తళతళ మెరుస్తున్నాయి తెల్లటి బాతులు ఆ ఆవరణలో అటూ ఇటూ తిరుగుతున్నాయి. పొడుగు మెడవాడు లోపలికి వెళ్ళగానే బాతులన్నీ గోలగోలగా అరిచేయి. అదివిని కోళ్లు అల్లరిచేసేయి. కుక్కలు మొరిగేయి. గుర్రాలు సకిలించేయి. అంతా గడబిడగా తయారయింది.

"ఎవరిదీ ఆ ఇల్లు?" బండివాణ్ని అడిగేడు సియావో.

చుట్టుపక్కలంతా జాగ్రత్తగా చూసి, ఎవరూలేరని నిర్ధారణ చేసుకున్నాక, "ఇంకెవడి కుంటాది బాబూ అలాటిల్లు? ఆ గోపురాల్నిసూడు. ఎంత ఇదిగున్నాయో?" అన్నాడు ఓల్సన్.

* 8 th Route Army.

"హాన్ ఇక్లేనా అది?"

"అవును" అన్నాడు బండివాడు. అంతకుమించి అతను చెప్పడు.

భూసంస్కరణ కార్యకర్తలరాక— హాన్ ఇంట్లో గందరగోళాన్ని సృష్టిస్తే, గ్రామస్థుల గుండెల్లో గుబులు తొలగించింది. పెంకుటిళ్ళలోనూ, పూరిపాకల్లోనూ ఆనందం వెల్లివిరిసింది, చిరునవ్వులతో బండిలో వస్తున్న వాళ్ళని చూడ్డానికి. ఆడా మగా అంతా రోడ్డుకి రెండువేపులా చేరేరు. వాళ్ళంతా చిరిగిపోయిన జీర్ణవస్త్రాలతో వున్నారు. ఒంటిమీద గుడ్డముక్కయినా లేని చిన్నపిల్లలు కొందరు బండివెనకే పరిగెడుతూ, బండి ఆగినప్పుడు వాళ్లూ ఆగుతున్నారు. ఎడంచెయ్యి చీకుతున్న చిన్న కుర్రాడొకడు— యూనిఫారాల్లోనూ, తుపాకుల్తోనూ, చిరునవ్వుల్తోనూ వస్తున్నవాళ్లని తలెత్తి చూసేడు. ఉన్నట్టుండి,

"అమ్మా! దలం*వాళ్లొచ్చేరే!" అంటూ ఇంటివేపు పరుగు తీస్తూ ధన్మని పడిపోయేడు. ఒంటిమీద సిల్కుబట్టలూ, నోట్లో పొడుగుపైపూ వున్న లావుపాటి మధ్య వయస్కురాలు ఒకావిడ, కొత్తవాళ్లు నన్నెక్కడచూసేస్తారో అన్నట్టు గబగబానడుస్తూ రోడ్డు వదిలి ఓ సందులోకి మళ్ళిపోయింది.

పెద్దపెద్ద ఆకులున్న చెట్ల గుబుర్లవెనకనున్న ఒకస్కూలు దగ్గిర ఆగింది బండి. దళనాయకుడు సియావో బండి దిగి చెట్ల ఆకుల్ని తొలగించి లోపలికి తొంగిచూసేడు క్లాసుగదులన్నీ ఖాళీగా వున్నాయి

"మనం ఇక్కడ దిగితే?...." అన్నాడు.

బండిలో వాళ్ళంతా సరేనన్నారు. ఒకరి తరవాత ఒకరు కిందికి గెంతేరు. ఆ తరవాత నెమ్మదిగా వాళ్ళ సామాన్లన్నీ బండిలోంచి బైటికిలాగి, స్కూల్లోకి మోసుకుపోయేరు.

బండివాడికి డబ్బులు ఇచ్చేస్తూ అతని భుజం తట్టి, "నీతో పరిచయంఅయింది; చాలా సంతోషం. ఈసారి ఈ దారంట వచ్చినప్పుడు ఇక్కడికిరా" అన్నాడు సియావో.

లోపల జేబులో డబ్బులు పడేసుకొని, "ఒస్తాను బాబూ! తప్పకుండా ఒస్తాను. మనందరికీ మంచిరోజులు ఒస్తాయి. ఒస్తాను బాబూ!" అంటూ సారా దుకాణంవేపు బండి తోలుకు పోయేడు ఓల్డ్‌సన్.

---

* 8 th Route Army అనుకున్నాడు ఆ చిన్నవాడు.

# 2

యువాన్ మావో గ్రామానికి పొలాలుపంచే సిబ్బంది రావడం ఓ పెనుమార్పుకి సూచన. నీటిమీదనించి చల్లగాలి వీస్తోందంటే వాన వస్తుందని ఎవరైనా చెప్పగలరు. అయితే ఆ వాన కుండపోతగా కురుస్తుందా? ఒక్క జల్లుతో పూరుకుంటుందా? ఆసంగతి చెప్పడానికి ఎవరికీ దమ్ములులేవు. అంతదాకా ఎందుకు, ఎప్పటి సమాచారం అప్పుడు తెలుసుకోగలిగిన జిత్తులమారి హానే సరిగా చెప్పలేకపోతున్నాడు.

అమధ్య కొన్నాళ్లు పగలూ రాత్రి అని లేకుండా హాన్‌గదిలో నల్లమందు దీపం ఎప్పుడూ వెలుగుతూనే వుండేది। కాంగ్* మీద నడుంవాల్చి, నల్లమందు బిళ్ళలు దీపంలోవేసి కాలుస్తూ అయినవాళ్ళతోనూ, ఆప్తులతోనూ మంతనాలాడుతూ వుండే వాడతను. కుట్రలు పన్నుతూనో, ఆజ్ఞలు జారీచేస్తూనో వుండేవాడు.

ఇప్పుడు మళ్ళీ హడావిడి బయల్దేరింది. కొన్ని నెలల కిందట కొమింటాంగ్ సైనికదళాన్నొకదాన్ని ఆర్గనైజ్ చెయ్యడంలో మునిగి తేలుతూ వుండేవాడతను. ఐతే అప్పటి హడావిడికీ ఇప్పటి హడావిడికీ ఓ తేడావుంది. అతనికి ఇప్పుడు యీ హడావిడికి తోడుగా గొప్ప ఆందోళనకూడా పట్టుకుంది. అతని దెయ్యపు మొహం మీద ఎప్పుడూ వుండే దెయ్యపు చిరునవ్వుకూడా కనిపించడం లేదిప్పుడు. ఆ మాటకొస్తే 8వ దళసైనికులు ఆ గ్రామంనించి బందిపోట్లని తరిమికొట్టిన దగ్గర్నించీ అతని మనఃస్థితే పూర్తిగా మారిపోయింది. కోపం ఎక్కువైపోయింది. ఏదిపడితే అది విసిరికొడ్తాడు. పనివాళ్ళని బండబూతులు తిడతాడు. పాలేళ్ళని చితక బాదుతాడు. భార్యతో కూడా తగువులు తెచ్చుకుంటాడు. ఆఖరికి అతని ప్రియాతి ప్రియమైన ఉంపుడుగత్తె కూడా అతని కోపానికి గురికాక తప్పలేదు.

హాన్ ఫెంగ్-ఛీ అంటే అందరికీ తెలుసు. ఏడుగురు అన్నదమ్ముల్లోనూ ఆరోవాడితను. దగ్గిరదగ్గిర ఏభైయేళ్లుంటాయి. నల్లమందుభాయీ కావడంతో, మనిషి బక్కగా ఎండిపోయేడు. జుట్టుకూడా బాగా పూడిపోయింది. చూడ్డానికి మాత్రం ఓ అరవైఏళ్ళవాడిలా వుంటాడు.

'ఆరోనెంబరు హాన్' అనీ, 'పొన్నుగర్ర హాన్' అనీ చాటుగా అతన్ని పిలుస్తారు జనం. కీలుబొమ్మ మంచుకో ప్రభుత్వంవున్న రోజుల్లో గ్రామాధికారిగావుండే వాడు హాన్. పొన్నుగర్ర ఒకటి చేత్తోపట్టుకుని వూరి జనం మీద పడేవాడు. ప్రతీ

* 'కాంగ్' అంటే పడుకోడానికి వాడే ఇటికల అరుగు. దగ్గిరలో వెలుగుతున్న పొయ్యి వుంటుంది. ఆ పొయ్యినించి వేడిగాలి ఆ అరుగుకిందకివస్తుంది.

ఏడూ తనకి కావలిసిన ధాన్యం గీన్యం వసూలు చేసుకునేవాడు. ఎవడైనా ఎదురుతిరిగేడా, పొన్నుగర్రితో చావుదెబ్బలు తిన్నాడన్నమాటే. ఇక రాత్రియీసరికి సానికొంపలకు పోయేవాడు. అక్కడ గదిలో వున్నంతసేపూ తన పొన్నుగర్రని గదిబైట గోడకి ఆన్చి వుంచేవాడు. ఆ కర్రని చూసి అటువైపు ఎవ్వరూ వచ్చేవారుకాదు. 'పొన్ను గర్రి హాన్' అన్న పేరు అలా వచ్చిందతనికి.

దళసైనికులు గ్రామంలో ప్రవేశించడం చూసినవెంటనే ఆ కబురు అందించడానికి పరిగెత్తేడు పొడుగు మెడవాడు.

"మాఁవయ్యా! మాఁవయ్యా! దళసైనికులు వచ్చేసేరు!" అంటూనే చేతిలో బుట్టని కిందపెట్టి కాంగు అంచుదగ్గిరికి వెళ్ళి నించున్నాడు.

పైపు కిందపారేసి గబుక్కునలేచి కూచున్నాడు హాన్. కూచుని, "వుండు, నువ్వేం చెప్పకు" అన్నాడు గాభరాగా.

లేచి కూచున్నవాడు కాస్తా అలా కూచోకుండా, ఆ గాభరాలో కాంగుమీంచి కిందికి గెంతేడు. ఆ గెంతడంలో అతని సిల్కు చొక్కా దీపానికి తగిలి అందులో నూనె అంతటా తుళ్ళింది. అతని నుదురంతా చెమట బిందువులతో నిండిపోయింది.

వారం రోజుల కిందట, అతని కోడలుగారి పుట్టింటినించి వుత్తరం ఒకటి వచ్చింది. వాళ్ళ గ్రామానికి పొలాలు పంచేవాళ్ళు వచ్చేరుట. వాళ్ళంతా కమ్యూనిస్టులట. వాళ్ళు బీదాబిక్కని బుగతల మీదికి ఉసిగొల్పుతున్నారట. పొలాలు లాక్కుంటున్నారట. ఇళ్ళు పంచుకుంటున్నారట. వాళ్ళు చెయ్యని దురాగతం లేనే లేదట.

ఈ వుత్తరం వచ్చిందగ్గర్నించీ. హాన్ తన సంగతికూడా ఆలోచిస్తోనేవున్నాడు.... నా ఇంటి మీదికీ, నా పొలాలమీదికీ ఎవడైనా వస్తాడా? రానీ. నాకేం ఫరవాలేదు. భూఁవంటే ఏఁవిటనుకుంటున్నారో? 'ఫుఫ్' అని వూదితే పోయేదేంకాదు. నీకు నా పొలం కావాల్రా బాబూ? తీసుకో. నా అదృష్టం పండకపోదు. నాలుగు రోజులు తిరిగేక, నేను 'ఊఁ' అంటే అంగుళం నష్టపోకుండా నా భూఁవి నాకు తిరిగివస్తుంది. తెలిసిందా? ఇక నా ఇల్లంటావా? రమ్మను. నా గుమ్మందాటి నా ఇంటోకి ఎవడు ఎలా అడుగుపెడతాడో నేనూ చూస్తాను. రమ్మను దమ్ములున్న లంజాకొడుకుని ... ఏఁవైనా, నా చరాస్థి సంగతే కొంచెం జాగ్రత్తగా చూడాలి. ఏఁవుందీ? ఏదో మంచి స్థలానికి అదంతా నిమిషంలో మార్పించేస్తాను.... ఇలా ఆలోచిస్తున్నాడు హాన్.

నిజానికి అప్పుడే అయిదారు రోజుల్నించీ ఇంట్లో ఖరీదైన నగలూ, వస్తువులూ పట్నానికి తరలించేస్తూనే వున్నాడు. రబ్బరుటైర్ల బళ్లు రెండూ, నగానికి పైగా సామా

న్లని పట్నానికి తీసుకుపోయేయి ఇప్పటికే. ఏమైనా, ఇంత త్వరలో వాళ్ళు ఈ వూరు వచ్చేస్తారని అనుకోలేదతను.

"ఎంతమంది వున్నారు వాళ్ళు?.... ఎక్కడ దిగేరు" అన్నాడు హాన్. అతనికి చిన్న వణుకు కూడా బయల్దేరింది.

"దగ్గిర దగ్గిర పదహారుమంది వుంటారు మాఁవయ్యా. స్కూల్లో దిగేరు" అన్నాడు పొడుగు మెడవాడు. అని, నెమ్మదిగా కాంగు అంచుమీద కూచున్నాడు. ఈరోజుదాకా అక్కడ కూచోడానికి అతను ఎన్నడూ సాహసించలేదు. కాని ఇవాళ పరిస్థితి వేరు హాన్‌కి తన అవసరం వుంది- అందుకే ధైర్యంచేసి కూచున్నాడతను.

"వాళ్ళ దగ్గిర తుపాకులూ, రైఫిల్సూ కూడా వున్నాయి" అన్నాడు.

ఇందాకటి వణుకునించి హాన్ ఇంకా తేరుకోలేదు. "ఛప్ నోర్మూయ్!" అన్నాడు వెంటనే.

పొడుగుమెడవాడు నోరు మూసుకున్నాడు. అతని అసలు పేరు హాన్‌పి.సాయ్. 'పొడుగు మెడ హాన్' అంటేనే అందరికీతెలుస్తుంది. అతనికి ఇరవై ఏడేళ్ళ వయసూ, చిన్న తలకాయా, పొడుగు మెడా, జిత్తులమారి తనమూ వున్నాయి. హాన్‌కి దూరపు బంధువు. వరసకి మేనల్లుడవుతాడు. ఇప్పుడిలావున్నాడు కానీ అతని జీవితంలోనూ కొన్ని 'మంచి' రోజులు లేకపోలేదు. జూదానికీ, ముండలకీ, నల్లమందుకీ వున్న దంతా తగలేసేడు. నల్లమందు కొనడానికి డబ్బులు చాలకపోతే, మార్ఫీను ఇంజక్షన్ల లోకి దిగేడు. దాంతో అతని జబ్బలు రెండూ కాయలు కాసిపోయేయి. మెడ పొడవుగా ఎదిగిపోయింది. నాలుగేళ్ళ కిందట, మార్ఫీనుకి కూడా డబ్బులు లేకపోతే సొంత పెళ్ళాన్ని తీసికెళ్ళి మరో వూళ్ళో వ్యభిచార గృహానికి అమ్మేసేడు. మాఁవ గారు వచ్చి గోలగోలపెట్టేడు. అది చూసి పొడుగుమెడవాడు కత్తి తీసుకుని తన చేతి మీద ఓ గాటు పెట్టుకుని ముసలాణ్ణి జడిపించేసేడు. చేతినించి రక్తం కారుతూవుంటే గగ్గోలు పెడుతూ నేలమీద పడి దొర్లడం మొదలెట్టేడు. ముసలాడు ఇదంతా చూసి గాభరాపడిపోయి, అల్లుడికి బాగా సొమ్ము ముట్టజెప్పి నోరు మూయించి, ఏడుస్తూ ఇంటికి పోయేడు.

కట్టుకున్న పెళ్లాన్నికూడా అమ్ముకొన్న తరవాత, పొడుగు మెడవాడు పాత బట్టలూ అవీ అమ్ముకు బతకసాగేడు. కాని యెన్నడూ అతనికి కడుపునిండా కూడూ దొఁకలేదు; మనసుతీరా మార్ఫీనూ దొరకలేదు. అతనికి అప్పుడప్పుడు కానీ పరకా పడేస్తూవుంటాడు- హాన్. అందుకే హాన్ వెనకాతల కుక్కలా తిరుగుతూ వుంటా

దతను— తోకాడించుకుంటూ. హాన్ చేసే దుర్మార్గాలలో పొడుగు మెడవాడి చెయ్యి కూడా వుండి తీరుతుందని వూళ్ళో అందరికీ తెలుసు.

మేనల్లుడివైపు ఓ ఓరచూపు చూసి, "వాళ్ళని గురించి నువ్వేం గాభరాపడకు. ఎన్నాళ్ళో ఇక్కడ వుండరు వాళ్లు" అన్నాడు హాన్.

"అవును. నాకామాత్రం తెలీదా?" అన్నాడు పొడుగుమెడ.

"మరి తెలిస్తే కొంచెం ఒంటిమీద తెలివుంచుకొని మసలుకో. మీ అత్తా నేనూ ఇద్దరం వయసు మళ్ళిన వాళ్ళం. కాటికి కాళ్లు జాచుకూర్చున్నాం, ఏ క్షణాన 'హరీ' మంటామో తెలీదు మేం పోయేటప్పుడు యీ ఆస్తంతా కట్టకట్టుకు పోతామంటావా? పోం కద। మరందుచేత దీన్నంతా జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్నామంటే ఎవరి కోసం? నీ కోసం. నీ దాయాదుల కోసమూను. తెలిసిందా? ఈ కమ్యూనిస్టులతో వ్యవహారం అంటే అంత సులభమైనదేంపీకాదు. నీకు గుర్తుందికదా? వాడు ఆదావో షాంగ్-ఛీ వాడొక్కడే జపాన్ సిపాయిల్ని* ముప్పతిప్పలు పెట్టి, మూడు చెరువుల నీళ్లు తాగించేడు." అన్నాడు హాన్. అని ఒక్క నిమిషం ఆగి మళ్ళీ అడిగేడు:

"అది సరేగాని నీ పరిస్థితి ఇప్పుడెలావుంది? డబ్బేంవైనా కావాలా?"

"నా పరిస్థితికేం? బాగానేవుంది.... ఏదో ఫరవాలేదు. ఫరవాలేదులే మావయ్యా।" అంటూ గొణిగేడు పొడుగు మెడవాడు.

ఈ గొణుగుడు ఎప్పుడూ మామూలే. మరేం వినక్కర్లేదు.

"ఎవరక్కడ? ఇలారా।" అంటూ యింట్లోకి పిలిచేడు హాన్.

హాన్ భార్య వచ్చింది. ఆవిడ బాగా భారీ మనిషి. మధ్యలో లావుగావుండి రెండు చివర్లా సన్నంగావుండే ఆదోరకం చెట్టులా వుంటుందావిడ. ఆవిడ నీలంసిల్కు గౌను వేసుకొని వుంది. నోట్లో పొడూగు పైపొకటి పెట్టుకొంది.

పొడుగుమెడ కొంగుమీంచి దిగి, గౌరవ సూచకంగా మెడ కొంచెం వంచి, ఆవిణ్ణి పలకరించేడు.

ఆరిపోయిన నల్లమందు దీపాన్ని మళ్ళీ వెలిగించడానికి అగ్గిపుల్ల గీస్తూ, భార్యని అడిగేడు హాన్:

"అవునూ, మన లీచెన్-చియాంగ్ మొన్న పంపించిన డబ్బులో ఇంకా ఏమాత్రం మిగిలింది?"

---

* ఈశాన్యచైనా జపాను ఆధీనంలో వున్నప్పట్నించీ అక్కడ జపాను సిపాయిలు వుండేవారు. 1945 లో సోవియట్ సైనికులు వాళ్లనందర్నీ వధించేరు.

"మిగలదవాఁ? అబ్బే, చాలా తక్కువ వుంటుంది" అంది భార్య. కళ్ళు మూసుకోకుండానే చక్కగా అబద్ధం ఆడేసిందావిడ.

"అది తీసుకొచ్చి మనవాడికియ్యి" అన్నాడు హాన్.

"అబ్బెబ్బెబ్బే! నాకేం వద్దు- అత్తా నాకేం అక్కర్లేదు. నువ్వు లోపలికి వెళ్ళకు- వద్దు ... వద్దు...." అన్నాడు పొడుగుమెడవాడు గబగబా. అన్నాడన్న మాటేగాని, డబ్బు తేవడానికి వెళ్తోన్న అత్తని మాత్రం ఆపలేదతను.

మరో నిమిషంలో, చిన్న నోట్లకట్ట ఒకటి పట్టుకొచ్చి, మేనల్లుడి మాసిపోయిన చొక్కా జేబులో కుక్కింది హాన్ భార్య.

మళ్ళీ మరోసారి కొంచెం వంగి, అత్తకి ధన్యవాదాలు చెప్పుకొని, వెళ్ళిపోయేడు పొడుగుమెడవాడు.

"ఏఁవిటి, వెళ్ళిపోతున్నావా? అలా వెళ్ళి మన లీచిన్-చియాంగ్‌నీ, తీన్‌వాన్-షున్‌నీ నేను రమ్మన్నానని చెప్పు" అన్నాడు హాన్.

మేనల్లుడు వెళ్ళిపోయేక మళ్ళీ యథాస్థానంలో కూచున్నాడు హాన్. కాంగ్ అంచుని కూచుని, లోకరీతిని గురించీ, మానవ స్వభావాన్ని గురించీ, ముఖ్యంగా గడియ గడియకీ వచ్చి డబ్బులు వడుక్కుపోయే ఈ దరిద్రపుగొట్టు వెధవతో సంబంధం గురించీ చెప్పసాగింది హాన్‌గారి భార్య.

"గొప్ప మేనల్లుణ్ణే సంపాదించేరు మొత్తంమీద. గద్దలా వచ్చి తన్నుకుపోతూ వుంటాడు. ఆ కొంగమెడా, దాని మీద పాంకోద్దొక్కులా మొహం వాడును మన సొమ్ము ఇంకా ఎన్నాళ్లు తింటాడో?!" అందావిడ కోపంగా.

ఇంట్లోకి ఎవరో వస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది హాన్‌కి.

"నీ మొహం నీకేఁవిటి తెలుసును! డబ్బుగోల తప్ప మరోటి తెలీదు నీకు. పో లోపలికి. ఎవరో వస్తున్నట్టున్నారు," అన్నాడు. పిల్లిలా లోపలికి వెళ్ళిపోయింది భార్య.

ఇంతలో ఇంటిముందు కుక్కలు మొరగసాగేయి. బాతులు గోలగోలచేసేయి. నెత్తిమీద గడ్డిటోపీ, ఒంటిమీద మాసిపోయిన చింకి గుడ్డలూ వున్న ముసలి మనిషి ఒకడు లోపలికి వచ్చేడు. ముడతలు దేరిన అతని నుదురూ, కళ్ళూ- బతుకుతో చిరకాలంగా అతను చేస్తున్న పోరాటాన్ని చెప్తున్నాయి. అతని చింపిరి గెడ్డంమీద దుమ్ము పేరుకొని వుంది.

టోపీని చేత్తోపట్టుకొని గదిలోకి వచ్చేడతను. కాంగుని సమీపించి భయపడుతూ భూస్వామిని పలకరించేడు. అతని రాకని గమనించనట్టే నటించేడు హాన్. నల్లమందు బిళ్ళ ఒకటి దీపపు మంటలోపడి చిటపట లాడింది. గదినిండా ఘాటైన పొగ అలుము కొంది. ఇంతలో మళ్ళీ ఇంటిముందు కుక్కల అరుపులు వినిపించేయి. పరమ భయంకరంగా మీదపడబోతున్న కుక్కల్ని కసురుతూ ఎవరో అరుస్తున్నారు.

"గుడ్డిముండల్లారా! నేనెవరో కనబడ్డంలేదూ?" అంటూ అరుస్తున్నాడతను. "హాన్‌గారున్నారా ఇంట్లో?" అన్నాడతనే.

"ఓయ్! లీ, నువ్వా? రారా, లోపలికి రా!" అన్నాడు హాన్ హడావుడిగా లేచి కూచుంటూ.

నవ్వుతూ లోపలికి వచ్చి, కాంగు దగ్గిరికి వెళ్లాడు లీ. అతని పూర్తిపేరు లీ చెన్-చియాంగ్. నెత్తిమీది చక్కటి నొక్కుల టోపీని తీసి చేత్తో పట్టుకుని,

"ఇవాళ మధ్యాన్నం యెవరో కొత్తవాళ్ల మన వూళ్ళో దిగేరు సార్. వాళ్ళు ఏదో దళం వాళ్ళట. ఎందుకొచ్చేరో, ఏం విటో ఎవరికీ తెలీదు"అని, తనకన్నాముందు వచ్చినతన్ని చూసి, "ఓ, తీన్! నువ్వా యిక్కడే వున్నావా?"అన్నాడు.

పువ్వు ఆకారంలో నీలంగావున్న జపాన్ పింగాణీ పాత్రలోంచి కొంచెం టీ తీసుకుని, ఒక్క గుక్కతాగి చిన్నగా దగ్గేడు హాన్. 'లీ'నీ, 'తీన్'నీ ఓసారిచూసి,

"మీరిద్దరూ యింకెవరివైనా పొలాలు చూసుకోడం మంచిది. నా పొలం నాకు కావాలి"అన్నాడు కుండబద్దలు కొట్టినట్టు.

నిలుచున్నచోటే, నడినెత్తిమీద పిడుగుపడ్డట్టయింది తీన్‌కి. టోపీ పట్టుకున్న అతని కుడిచెయ్యి గడగడవణుకుతోంది.... ఇప్పుడు పొమ్మంటే యెక్కడికి పోతాడు తను! మరోచోట పొలం చూసుకోమనగానే ఎక్కడ చూసుకోగలడు? అలాగయినా పాత అప్పులు తీర్చడం ఎలాగ? తనూ, తన భార్యా (ఆవిడ గుడ్డిదికూడాను) యింక ముష్టికి వీధుల్లోకి బయల్దేరాలి!.... తీన్ ఇలా గాభరాపడుతూ వుంటే, లీ నిదానంగా నించున్నాడు. కనుబొమలు ముడిచి, అయ్యగారిమాటలకి 'అసలు అర్థం'ఏమిటా అని ఆలోచిస్తున్నాడు. మనమీద హాన్ బాబుకింత కోపం రావడానికేం జరిగింది? ఈమధ్య నల్లమందు ధర బాగా పెరిగిపోయింది. అందుకని, శిస్తు పెంచుదామనుకొనివుంటాడు. లేకపోతే ఒకవేళ యీ కొత్తగా వచ్చిన భూసంస్కరణల దళాన్ని మట్టుపెట్టడానికి మన సహాయం కావాలేమో? అదే నిజమైతే, బాబు మనతో పెద్ద అబద్ధం చెప్తున్నాడన్న మాట.... తన అవసరం యజమానికి వుండొచ్చునని తట్టగానే అతనికళ్ళు మెరిసేయి.

చిన్న చిరునవ్వు నవ్వి "ప్రభూ ఈ పొలం తమది. తమరు తమకు కావాలంటున్నారు. తమ పొలం తమకివ్వకపోవడానికి నేనెవణ్ని. తప్పకుండా ఇస్తాను" అన్నాడు.

విజయసూచకంగా చిన్న నవ్వు నవ్వుకున్నాడు హాన్. కాంగుకి పక్కనున్న పొయ్యిమీద మూతపడేసి, లీని చెయ్యిపట్టుకొని అవతలిగదిలోకి తీసుకువెళ్ళేడు. ఏదో గుసగుసలాడుకున్నారు వాళ్ళిద్దరూ. ఆ చల్లటిగదిలో అలాగే ఒంటరిగా నిలబడి పోయేడు తీన్. బొంగురు గొంతుతో లీ అంటున్న మాటలు అతనికి వినిపించేయి.

"తమపనంటే అది నా పనే బాబూ। ఏం కావాలంటే అది తమకి చేసి పెట్టడానికి నేనున్నాను."

కొంతసేపు నిశ్శబ్దం. తరవాత ఇంటిముందు అడుగుల చప్పుడు. కుక్కల మొరుగుడు. బాతుల గోల. మళ్ళీ గదిలోకి వచ్చేరు హాన్. లోపలికి వస్తున్నప్పుడు అతని పెదాల కొనల్లో చిరునవ్వు వెలుగుతూవుంది. కాని తీన్‌ని చూడగానే ఆ చిరునవ్వు ఆరిపోయింది. ముఖం మొటమొటలాడుతూ తయారయింది.

పాలేళ్ళతోనూ, రైతులతోనూ అనేక వ్యవహారాల్లో యిరవైఏళ్ళ అనుభవం ఉంది హాన్‌కి. అతని ముఖం ఎప్పుడూ తెల్లగా పాలిపోయి ఉంటుంది. చెంపలకి జపాన్ వాళ్ళ సైజులో చిన్న పుస్తీలు ఉంటాయి. అతనికి సందర్భాన్ని బట్టి చిరునవ్వులు చిందించడానికీ, కరుకు నిప్పులు కక్కడానికీ కావలసిన చాకచక్యం ఉంది. ఎలాంటి ఘాతుకాన్నైనా చెయ్యగలడని చెప్పే గాజుకళ్ళున్నాయి.

తిండి తిన్నాక అప్పుడప్పుడు అలా తిరిగివస్తూ వుంటాడతను. దార్లో ఒక్క రైతెవడైనా అతన్ని చూసి నమ్రతగా పలకరించేడనుకోండి. అతను వాడివైపు చూడనే చూడడు. మరి మోతుబరి కనబడితే?— చిరునవ్వులు వెలి బూడిదలా ముఖమంతా పులుముకుంటాడు. తాత తండ్రుల దగ్గిర్నించి అతను నేర్చుకున్న గుణపాఠాలు చాలా ఉన్నాయి. "ఎవణ్ణీ పూర్తిగా నమ్మకు"ఇది మొదటి పాఠం. "నిజానిజాలు నీకు తెలిసిఉండొచ్చు: కాని నిజం మాత్రం ఎన్నడూ చెప్పకు" ఇది మరో పాఠం. "ఒకడికి చెప్పిన కథ మరొకడికి చెప్పకు" ఇది యింకో పాఠం.

ఒకేసారి తాంగ్‌తీన్ అనే స్నేహితుడితో మాత్రం తనని గురించిన ఒక వచ్చి విజాన్ని బైటపెట్టాడు హాన్. "డబ్బు బాగా సంపాదించడానికి ఐదు బ్రహ్మసూత్రాలున్నాయి: ఒకటి- లౌక్యంగా వుండాలి; రెండు- జిత్తులమారిగా ఉండాలి; మూడు- గుప్తంగా ఉండాలి; నాలుగు- మొండిగా ఉండాలి; ఇక ఐదోది- అమానుషంగా ఉండాలి".

గదిలోకి వచ్చి పైపు పీలుస్తూ కాంగుమీద సుఖంగా కూచున్నాడు హన్. తీన్ మాత్రం అలాగే ఆ చలిలో నించున్నాడు. సరిగ్గా ఆ సమయంలో హాన్‌గారి భార్య ఆ గదిలోకి వచ్చింది. భార్యని చూసి 'నువ్వే చెప్పు'మన్నట్టు కన్నుగీటేడు హన్.

ఓయ్ తీన్! నీదగ్గిర్నుంచి ఆ పొలం తీసుకోడం మాకుమాత్రం ఇష్టఁవంటావా? కాని ఏఁవిటంటే, నీ మంచికోసఁవే వదిలీమంటున్నాం. పొలం చూస్తే అసలు సారఁవన్నది లేకుండా తయారయింది. ఈ మాత్రం శ్రమపడితే మరెవరి పొలంలోనైనా నిక్షేపంలాంటి పంట పండుతుంది.

"బాబయ్యా!.... తల్లీ!!...." గబగబా అన్నాడు తీన్ చేతులు నులుపుకొంటూ. "తల్లి తల్లి! ఉప్పుడు ఈ పొలం నాక్కుంటే తఁవకి తీర్చవల్సిన అప్పులు ఉప్పుడు కాదుగదా, నాను వచ్చే జనమలోనైన తీర్చనేను ఇయాల్టికియాల మరొకరికాడ పొలం సూసుకోమని సెలవిస్తే నానెక్కడికి పోగల్ను? ఒకేల ఎక్కడేన దొరికినా, ఊరవతల దొరుకుతాది. నా గుడ్డిగుర్రం అందాక నాగనేదే! ఇంత కాలఁవయి మీకింద పనిసేసుకుంటన్నాను; ఒక్క పాలైన తఁవ మాట జవదాటినానా? పండిన పంటంత తఁవకే దాకలు సేసుకుంటన్నాను ..." అన్నాడు తీన్.

దిగ్గునలేచి కూచున్నాడు హాన్.

"ఈ కబుర్లకేంగాని. ఊళ్ళోకి కమ్యూనిస్టులు వచ్చేరు. వాళ్ళురావడం మనకి మంచిదేనంటావా?" అని సూటిగా అడిగేడు.

"తఁవరేటి సెప్తున్నారో నాకేటి బోదపడ్డంనేదు బాబూ! పొలాల్లో పడిపన్లు సేసుకునీవోల్లం. మాకు కమ్యూనిష్టులు మంచోల్లో సెడ్డోల్లో ఏటి తెలుస్తాది బాబూ!"

—అన్నాడేగాని తీన్‌కి లోపల్లోపల ఆ కమ్యూనిస్టులు ఎనిమిదవ దళ సైనికులని తెలుసు. ఆ మధ్య ఆ వూరికి వాళ్ళు వచ్చినప్పుడు, వాళ్ళలో ముగ్గురు తీన్ గుడిసెలోనే వున్నారు. ప్రతిరోజూ అతనిఇల్లూ వాకిలీ మళ్ళీ శుభ్రం చేసేవాళ్ళు. పొయ్యిలోకి కర్రపేళ్ళు అవీకూడా కొట్టేవాళ్ళు. 'కమ్యూనిస్టులు చెడ్డవాళ్ళు' అని చెప్పడానికి ఒక్క కారణంకూడా అతనికి కనబడలేదు. అయితే బుగతతో 'వాళ్ళు మంచివాళ్ళు' అని చెప్పే ధైర్యం లేదతనికి. అంచేత అదేదో నాకు తెలియదని చెప్పి తప్పించుకొన్నాడు.

కాని హాన్ వూరుకుంటాడా?

"ఇప్పుడు రాజ్యఁవంతా మీదేనా? పల్లకీ లెక్కి మీరు వూరేగుదురుగాని. మేఁవంతా మీ పల్లకీలు మోసుకుంటూ బతుకుతాం!!" అన్నాడు పళ్ళు బిగువున.

(మిగతా 41వ పేజీ తరువాయి)

## కత్తి పాట

దండు ఎర్రిన్న

ఇంతేన మన బతుకు? ఓ కామ్రెడ్
ఎంతాకి మారాద? ,,

మాలోడి కొడుకెపుడు ,,
కూలోడె కావాల్న? ,,

దొరగారి పిలగాడె ,,
మనఊరి పెసిడెంట? ,,

పటేల్కు బుట్టినోడె ,,
పట్టణంలో మంత్రియవున? ,,

పట్వారి చినమరిది ,,
పల్లెకెల్ల పెద్దమనిష ,,

పంతులయ్య పెళ్లమొకతె ,,
ఊరికెల్ల పతివ్రితా? ,,

మాదిగోళ్ళ పెళ్ళాలంత ,,
ఊరివాళ్ళ ముండలేన? ,,

డాకటేరు కొడుకెపుడు ,,
డాకటేరె అయ్యిపోవ ,,

గుత్తెదారు బిడ్డలెల్ల ,,
కట్టమీద ఇళ్ళు కట్ట ,,

ఏనాది పోరగాడు ,,
ఎండ్రికాయ లేరాల్న? ,,

ఎరకలోడి చిన్నవాడు ,,
పంది పెంపె ఎత్తాల్న? ,,

ఉన్నవోడికి బుడితె ,,
ఊరంత ఏలవచ్చు? ,,

లేనివోడి కడుపునబడితె ఓ కామ్రెడ్
పోని కష్టం, తీరనాకల? ,,

ఎట్టాగ మారాల? ,,
ఇంకెట్టాగ మారద్ది? ,,

ఇంతేన మన బతుకు? ,,
ఎంతాకి మారాద? ,,

దేవుడే దిగివచ్చి ,,
రామయ్య అయ్నిగాని ,,

రామావతార మంత ,,
సీతమ్మకె సరిపోయె ,,

దేవుడే కింది కొచ్చి ,,
కిష్ణమూర్తి అయ్నిగాని ,,

కిష్ణావతారమంత ,,
గోపికల్కె చాలదయ్యె ,,

రాజులే నడిచివచ్చి ,,
బుద్ధ మూర్తులయ్నిగాని ,,

బుద్ధావతారాలంత ,,
బోధలకె సరిపోయె ,,

అల్లాయె దిగివచ్చిన ,,
ఏసయ్య చచ్చి బతికిన ,,

ఏం జెప్ప ఏమి వారిగె? ,,
ఏం మిగిలె మనకు గొప్ప? ,,

కోటి స్వాము లొచ్చిరిగాని ,,
కూలి కడుపు నిండదాయె ,,

ఊరూర ధరమాలు ఓ కామ్రేడ్
ఊరు నిండా ఆకల్లే ,,

రాళ్ళ కెల్ల గుళ్ళు కట్టె ,,
గుడిసె చుట్టు కీచురాళ్లె ,,

ఎట్టాగ మారాల? ,,
ఇంకెట్టాగ మారద్ది? ,,

ఇంతేన మన బతుకు? ,,
ఎంతాకి మారాద? ,,

కల్లవారి బిడ్డలంత ,,
కమ్మినిష్టు పార్టి జేరె ,,

పులులన్ని మేకల్జేరి ,,
ఉలవల్ని తింటామనె ,,

ఆకలెరుగని అయ్యలొచ్చి ,,
ఆకలి బోవ పాట పాడె ,,

ఎన్నికల్లో కూలిరాజ్యం ,,
మన్నికంగ తెస్తమనిరి ,,

ఎర్రిజెండ కెరువుబోయె ,,
కాయితం పూలతావిరాదు ,,

కమ్మినిష్టు కాంగ్రెసాయె ,,
కాంగిరేసె కామ్రెడాయె ,,

గరిక పాసు పేరె గడ్డి ,,
గడ్డి పార్టి లేకంగావ? ,,

ఎట్టాగ మారాల? ఓ కామ్రేడ్
ఇంకెట్టాగ మారద్ది? ,,

ఇంతేన మన బతుకు? ,,
ఎంతాకి మారాదా? ,,

మంత్రాన్కి కాయలు రాలవ్ ,,
మాటల్తో చింతలు కాలవ్ ,,

ధరమాల్తో పాపంపోదు ,,
వోటుల్తో చెమట ఆరదు ,,

కత్తితోనె కూలిరాజ్యం ,,
కత్తిపట్టి ముందు నిలువు ,,

ఎత్తిన కత్తి దించబోకు ,,
దొరల నెత్తుర కత్తి నూరు ,,

ఎర్రిని కత్తిని ఎర్రిగుంచు ,,
ఎర్రి సైన్యం ఎదగజేయి ,,

ఎర్రి సైన్యం కూలి సైన్యం ,,
కూలి సైన్యం కూలిరాజ్యం ,,

ఇట్టాగె మారాల ,,
ఇట్టాగే మారద్ది ,,

పెజాబందూకు సైన్యంతో ,,
ఇబ్బందూలు కాలిపోవ ,,

# కొత్త విప్లవ శక్తులు

అద్దేపల్లి రామమోహనరావు

అమాయకులైన పేద ప్రజలనబడే దూడలకి
"సోషలిజమ్"పాలు బాగాకుడిపి మైమరపించి
ప్రభుత్వమనే కామధేనువు
ఉన్నతవర్గాలకి కోరిన వరాల్ని కురిపిస్తోంది—
డబ్బురూపంలో కోట్లాది భక్తులు చెల్లిస్తున్న భక్తిని
దాచుకోడానికి యినప్పెట్టెలు చాలక
దేవుడు దొంగ వ్యాపారుల్ని ఆశ్రయిస్తున్నాడు—
రాజకీయ నాయకత్వానికి సిద్ధాంతాల్ని తాకట్టుపెట్టి
అధికారానికీ పదవికీ పలుకుబడికీ స్వతంత్ర భావాల్ని అమ్ముకుని
"ఈ సమాజం ఇంతే, నువ్వూ నేనూ మార్చలేం"
అనే ఎడ్జస్టుమెంటాలిటితో, చక్కని సమాధి తమచుట్టూ నిర్మించుకుని
మేధావులందరూ "మేతావులై"
సంఘాన్ని తొక్కి పాడుచేసే వృషభాల్ని
స్వేచ్ఛగా మీదికి ఆహ్వానిస్తున్నారు:—
సినిమాల్లో "సెక్సూ క్రైమూ" సంఘాన్ని నాశనంచేస్తోందని
మనముందు గొంతుచించుకున్న పెద్దమనిషే
వెనక్కితిరిగి సెక్సునీ క్రైమునీ ఆరాధించి
'A' సర్టిఫికెట్టు ప్రసాదించి
"చిన్నపిల్లలు చూడకూడదని" సంఘంలో
పెద్దపిల్లల నీతిని కాపాడుతూ వుంటాడు—
నీతీ నిజయితీలతో, విద్యార్హతలతో
ప్రజాస్వామ్యంలో ఎవరైనా ఏ స్థానమైనా పొందగలరని
వెలుతురులో వేలాడదీస్తారు బోర్డులు

చీకటిలోకివెళ్తే గడ్డి, బుడ్డి, బుద్దది సాధించలేనిపదవి
ఈ ప్రజా స్వామ్యంలో లేదు—

ఈ సమాజ ఉన్నతవర్గం
కథల్లో సినిమాల్లో పాతివ్రత్యాన్ని బోధిస్తుంది
జీవితంలో వ్యభిచారిణుల్ని తయారుచేస్తుంది
వేదికమీద ఆధునిక భావాల్ని ప్రచారంచేస్తుంది
వేదికదిగి బాబాలజుట్టుతో మెడకి ఉరేసుకుంటుంది
రేడియోల్లో పోషక పదార్థాల దబ్బావాయిస్తుంది
సమాజంలో వాటిని తినలేనిజనాన్ని పెంచుతుంది
ఉపన్యాసాల్లో లంచాల్ని చీల్చి చెండాడుతుంది
సామాన్యుడికి అవిలేనిదే బ్రతకలేని పరిస్థితుల్ని సృష్టిస్తుంది
గాంధీనామాన్ని జపమాలగా తిప్పుతుంది
జపమాల బ్రాందీవాసన కొడుతూఉంటుంది
నేను పదిరూపాయలటాక్సు చెల్లించకపోతే నన్ను వెంటాడి జైల్లో పెడుతుంది
వాడు పదిలక్షల టాక్సు చెల్లించని దమ్ముకలిగి ఉన్నందుకు
వాడికి మంత్రిపదవినిస్తుంది—

కంచే చేనుమెయ్యడమనే సామెతకి
నిఘంటువుగా మారిపోయింది సమకాలీన సమాజం॥
ఈ కుళ్ళిపోయిన రాజకీయాల్లోనుండి
కొత్తవిప్లవ శక్తులు రాజుకుంటున్నచోట,
మనస్సులోపలి ఏకాంత కేంద్రాల్ని పగలగొట్టి
వ్యక్తిలోనుండి సమాజం చీల్చుకొచ్చేచోట
దోపిడిశక్తుల భస్మంలోనుండి
సమానత్వం గులాబులై పూచినచోట,
మూఢనమ్మకాల చివరికేకల్లోనుండి
మానవతా మధుర సంగీతం వినిపించేచోట
నవయుగం నీ తలుపుతట్టినవేళ
గడియవేసుకుని గాఢనిద్రపోకు।

నవశక్తులు నీ గుండెని పిలుస్తున్నప్పుడు
సమాజస్పందన వినిపించని నిశ్శబ్దంలో నీలోపల శూన్యంలోదాక్కోకు
నిన్న తగలబెట్టలేని విలువల్ని
నేడు తగలబెట్టడానికి—
నిన్న ఎదిరించలేనివారిని
నేడు ఎదిరించడానికి—
నిన్న సాధించలేని సమాజాన్ని
నేడు సాధించడానికి—
నువ్వు పూనుకునే ఈనాటి సంకల్పంలోంచి
నిప్పుమీదనడిచి రక్తంకార్చి ఉద్యమించే నీ పురోగమనంలోంచి
రేపటి సమసమాజం రూపుదిద్దుకుంటుంది.
ఈనాడు తెగిపోయిన నీ కలల్లోంచి
రేపటి వాస్తవం సూర్యోదయంలా ప్రజ్వలిస్తుంది.

# కోర్టుల "మాయ"

లక్ష్మీపతి

జరగని విషయం జరిగిందన్నారు. జరిగిందని చెప్పబడిన జరగని విషయం జరగలేదన్నారు. లేదు. ఉంది. లేదు. అంతా మాయచేసేరు.

—రా. వి. శాస్త్రి

('ఆరు సారాకథలు'లోని "మాయ" 52 వ పుటనుండి)

జ్ఞానంలేక అనుభవం రెండువిధాలుగా, ప్రత్యక్షంగా, పరోక్షంగా సంపాదించవచ్చు. ఈ రెండురకాల అనుభవాల్లోనూ మొదటిది వ్యక్తి సమస్యలు లేక పరిస్థితులను తాను స్వయంగా ఎదుర్కొని సన్నిహిత సంపర్కంవలన సంపాదించింది కనుక రెండవదానికంటె గాఢతరమైనదీ నమ్మదగినదీ,

రా.వి, శాస్త్రిగారు వృత్తిరీత్యా న్యాయవాది. కోర్టులగురించి కోర్టుల న్యాయం గురించి నావంటివాడు ఏవో విన్నవీ ఊహించినవీ చెప్పినవాటిలోకంటె స్వానుభవంతో ఆయన చెప్పే విషయాల్లో ఎక్కువ సత్యముంటుందంటే ఎవ్వరికీ అభ్యంతరం ఉండటానికి ఆస్కారంలేదు. అయితే ఆయన చెప్పే విషయాలు రుచించకపోవచ్చు మింగుడుపడకపోవచ్చు; మన నరనరాల్లో జీర్ణించుకుపోయిన పరంపరాగత ఆర్షసంస్కృతీ సభ్యతల పవిత్ర మహావాహినుల(వాహిని అనడమిక్కడ ఒకవిధంగా అపప్రయోగమే. వాహిని ప్రవహిస్తుంది, అంటే మార్పుకు ప్రతీక. కాని మనలో సత్యాయి మారవు. అవి పరివర్తనాతీతాలు పరిణామాతీతాలు అనే భావం బాగా నాటుకొని ఉంది. మారుతున్నకాలంతోపాటు సంఘవ్యవస్థ, విలువలు మారుతాయి. మారాలి అంటే ఒప్పుకోము: Stagnation ఉంది మన స్వభావంలో) అంశకారణంగా అసత్యాలనిపించవచ్చు. ఈయన మాటలు అసత్యాలని అపసవ్యాలని అవి ఘూర్ణిల్లవచ్చు. కాని బొంకులను పేమార్లుపేర్చిల పూర్ణసత్యము మారునేల ?

ఈ కథలో శాస్త్రిగారు న్యాయస్థానాల సంగ్రహచరిత్ర న్యాయసంవిధానపు పోకడలతోపాటు సమాజంలోని మేధావుల(ముఖ్యంగా ఉన్నతవర్గంవారు) మధ్యవర్గీయుల, నిమ్నవర్గీయుల స్వభావాలు, వారి ఆలోచన, ఆచరణావిధానాలు నిర్దుష్టంగా ఒక మిల్లీగ్రాము బీరుపోకుండా చిత్రించారు.

కోర్టు
అబద్ధాలకి పాములపుట్ట !

కోర్టు
బందిలదొడ్డికి రాచబాట। ('న్యాయం')

కోర్టంటే ఏమిటో తెలుసా? పెద్ద అడివి. అందులో మనిషినవ్వినట్టు అరిచి, పార్టీలనాకర్షించి, నవ్వువినివెళ్తే నమిలిమింగేసే హయీనా (హయీనాకి తెలుగు పేరు తెలుసా? దుమ్ములగొండి)లుండే బహుభయంకరమైన స్థలం.

మనం ఈ న్యాయం, ఈ కోర్టులు ఇంగ్లీషు"వాడిభిక్షేనన్న సంగతి మర్చి"పో కూడదు. ఇక్కడ "సివిల్ కేసవనీ క్రిమినల్ కేసవనీ సాక్ష్యంతోనే సంబంధం." న్యాయం, ధర్మం, సత్యం అనే మాటలు చెవులు తూట్లుపడేలా పేల్చేన్యాయవాదులనే హరిశ్చంద్రులంటారు. అయితే వారు తీర్పు చెప్పరు కనుక వారిని పాపం అంటదు. ఆ పాపాలన్నీ జడ్జీలవి, ఖర్చులన్నీ పార్టీలవి. లంచాలన్నీ సాక్షులవి గుమాస్తాలవి, ఫీజులన్నీ జీవితం జీవితమంతా న్యాయానికే అంకితంచేసిన హరిశ్చంద్రులది.

కోర్టుల్లో చాల సౌలభ్యంఉంది. ఏ పార్టీకెలాంటి కోర్టు, ఏ జడ్జికెలాంటి తీర్పు కావాలంటె అలాంటివి "జీహాఁ" అంటూ ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటాయి. ఏ విధంగా కావలిస్తే ఆవిధంగా సాక్ష్యం పలకడానికి దేశంలో కావలసినంతమంది దొంగరాస్కెల్సు, మప్పడానికి దుమ్ములగొండ్లలాంటి ప్లీడర్లు ఉన్నారు.

ఇంగ్లీషువాడిది బహునిష్పాక్షికదృష్టి. తనదేశమూ పరదేశమూ అనేభేదభావం లేదు, ఎక్కడైనా ఒకటే న్యాయం చెప్పాడు: "ఆకులన్నీ ప్రజలవి. ఆపిల్‌పళ్ళన్నీ అధికార్లవి.... పనికూలీవెధవల్ది, లాభంబుగతది," కూలీవెధవలు ఎక్కువ సంఖ్యలో ఉంటారు, కడుపుమంటకాగలేక తెగించి సమ్మెలుకట్టినా ఎదురుతిరిగినా తన సాయానికి కోర్టులున్నాయి. బంగళాలు తనకు చక్కగా కట్టించుకొని వీళ్ళకు మాత్రం జైళ్లు కట్టించాడు. తన ఉనికికే మోసం వస్తుందని పసిగట్టి అక్కడా అక్కడా చలాయించినట్లు యిక్కడకూడా కూలీవెధవలు పెత్తనం చలాయిస్తారేమోనని అనుమానం తగిలి సాటి షావుకార్లకి రాజ్యం అప్పజెప్పి చల్లిగా జారుకున్నాడు. ఇది షావుకార్లరాజ్యం, గురువునుమించిన శిష్యులైన షావుకార్లరాజ్యం. వాడు మన ఉప్పు మనకే అమ్మి "నా ఉప్పుతిన్నావు, నాకు విశ్వాసంగా ఉండవా?" అన్న మాయగాడు. కాని "నా దగ్గర జీతాలు(....తాలుజీతాలు)తీసుకొనినాకే యెదురుతిరుగుతావా?"అని ఏదీసృష్టించక కాలు కదపకుండా దిండ్లమీదకూర్చొని సర్వమూ సృష్టించే శ్రామికుణ్ని అడిగే వీడు (ఉత్పత్తి అయిడియాలకే అన్నీపుడుతాయని నమ్మేవాడు) మహామాయగాడు, వీళ్ళని స్తుతించే పెద్దలు యెంతోమంది ఉన్నారు. వీరి న్యాయాన్నాకాశానికెత్తేవారు కోకొల్లలు.

ఈ కోర్టులు సత్యాల స్థావరాలు కావు. ఇవి సత్యాన్ని తాముగా చూడలేవు సాక్షులు ఏవిచూపిస్తే వాటికండ్లతో అవే చూసి అవే నిజమని తీర్పుచెపుతవి. ఇవి పరాన్నభుక్కులను పెంచుతాయి. ఎదుటివారి అసహాయతను ఆధారంచేసుకొని వాళ్లను పీల్చి పిప్పిచేసే జలగలను పోషిస్తవి. ప్రోత్సహిస్తవి. మూర్తిలాంటి (ఆచరణకుతూగలేని) ఆదర్శవాదిసైనా మధ్యవర్తి జలగలమాట వినేటట్లు, నెత్తుటి కూటికాశపడేటట్లుచేస్తవి.

ఈ కోర్టుల న్యాయసంవిధానంలో "సాచ్చిదార్లు" కీలకపాత్రధారులు. మూలపురుషులు. ఈ "సాచ్చిదార్లే" గనుక కూడబలుక్కున్నారంటే జరిగినదానిని జరగలేదని, జరగనిదాన్ని జరిగిందని మాయచేసి నందిని పందినీ, పందిని నందినీ చేయగలరు. ఈ సాక్ష్యాల తంతంతా పచ్చిబూటకపు వ్యవహారం, the most ridiculous farce గా అనిపిస్తుంది. "సాచ్చిదార్లు వొకరెనక వొకరూ బోనెక్కినా ముందిద్దరూ కూడబలుక్కునే యెక్కుతారు. ఆయనకవోరండాల గుమ్మంవోరన నిలబడి అను సెప్పిందీదూ, ఈడు సెప్పిందాదూ యింటానే ఉంటారు. కిటికీలకాడనిలబడి బోనెక్కనోడికి సేతులూపుతానే ఉంటాడు. దూరంగా వొమ్మంటే అళ్ళ మనిసి మరోడు 'ఆల్లో' నిలబడి సాచ్చికం బాగాయిని యెళ్ళి రెండోసాచ్చిదార్తో సెప్పొస్తాడు. అంచేత బాబూ, కోర్టులాంట అన్నేయాలు నిలబడిపోతాయి." సాచ్చిదార్లు గట్టిగానిలబడిపోతే కేసేటవుద్ది? సిచ్చవుద్దిలేకపోతే తేలిపోద్ది. ఈ సాక్ష్యాల తంతు యెప్పుడూ ఒక నిర్ణీత పద్ధతి— routine procedure- లో (ముఖ్యంగా సాచ్చిదార్లు పోలీసుబాబులే ఐనపుడు) జరుగుతుంది. అవి వాళ్ళకు కొట్టినపిండి. "తెల్లారెగిస్తే ఇలాంటి కేసల్లో యెయ్యికేసల్లో సాచ్చికంసెప్తారు." దాంతో ఎట్లా సాక్ష్యంచెపితే నిందితుడు యిరుక్కుంటాడో, ఎట్లా చెప్పకుంటే విడుదలౌతాడో బాగా తెలిసినవారైయుంటారు. స్వభావతః అట్లా అయిఉండనవసరంలేదు ప్లీడర్లతరిఫీదులో రాటుదేల్తారు. కనుక ఈ లొసుగులు తెలిసిన అనుభవజ్ఞులు "ఎద్దుబాటు" లాంటి అవసరమైనవాళ్ళను కట్టుకుని కేసు తేలగొట్టేయించుకుంటారు. జెరిమానాలూ జైళ్లూ "ఏటీసొదన్నెప్పు" విసిగి ఎవరికి "సదివించుకునేది" వారికి సదివించుకుంటారు. బయటపడ్తారు. ఎంత నేరంచేసినా ఇలాంటి న్యాయస్థానాల్లోఉన్నంత సౌకర్యం రక్షణా డబ్బున్నవాళ్ళకు మరెక్కడా ఉండదు. అసలు మనం నిజాన్ని గురించి తెలుసుకోవలసిన నిజమెకటుంది. పారమార్థికదృష్టితో చూస్తే నిజం అనేది ఎక్కడైనా ఎవరికైనా ఒకటే. కాని వ్యావహారికదృష్టితో చూస్తే "కోర్టువోరి నిజం యేరేనిజం బాబూ." అది కట్నంసదివించుకుంటే బయటపడేనిజం.

ఈ న్యాయస్థానాల్లో మనం నమ్మలేని విచిత్రాలు జరుగుతాయి. సాక్ష్యాధారంగా తీర్పుచెపుతారుకదా అలాంటి తీర్పు objective గా ఉండదా? అనే అనుమానం కల్గ

వచ్చు. అసలు సాక్ష్యమే objective గా ఉండని బనాయింపు సాక్ష్యమైనపుడు తీర్పువిషయంలో చెప్పేదేముంది? ఇంకో విషయంకూడా ఉంది. పాగాపెడితే దేవేంద్రుళ్లాగానూ, పాగాతీస్తే రాజగురువులాగానూ ఉండే న్యాయాధికారులుంటారు, వారు తీర్పుచెప్పడానికి నిందితుని దుస్తులనుకూడా గణనలోకి తీసుకుంటారు. ఇవి ఆయా అధికారుల అభిరుచులనుబట్టి మారుతుంటాయి ఒక బాబుకు మంచిబట్టలు వేసుకున్నవారంటే మంటబుట్టవచ్చు మరొక బాబుకు చింకిపాతలపై కోతకలుగవచ్చు. వీటి కారణంగా "సిల్కు-చీరకు మూడువందలు ఖర్చవగా చింకిచీరకు ఆరువందలు ఖర్చయిన పైనం" (రాజు-మహిషి పుట 347)ఉన్నా మనం ఆశ్చర్యపడనవసరంలేదు. ఈ న్యాయ సంవిధానంలో Subjective element ఎంతగా పనిచేయవచ్చునో మచ్చుకు చూసుకోవచ్చు. కనుక యిందులో నిజానికి పట్టంగడతారంటే నమ్మలేము కట్టరా? అంటే అదీ సందేహమే. ఎందుకంటే నిజమనేది మనమనుకునేది కాదుగా, "కోర్టు వారి నిజం యేదే నిజంబాబూ" ఒకవిధంగాచూస్తే ఇక్కడ నిజమే(సత్యమే)జయిస్తుంది. సత్యం యీ కోర్టుల్లో ఎంతవరకు జయిస్తుందో ఇంకా స్పష్టంగా తెలుసుకోవాలంటే 'సత్యాన్ని'హత్యచేసి నిజానికి గోరీకట్టిన 'నిజం' నాటకం చదువుకోండి.

మధ్యవర్తుల గురించి: సర్వసాధారణంగా వీరు సమాజంలో మధ్యవర్గీయులే అయ్యుంటారు. ఏ పనీ చేయకుండా ఎదుటివారి అసహాయతను Exploit చేసేరకం. వాళ్ళమీద లేని సానుభూతినొలకబోస్తారు. కాని "వందకి తక్కువచెయ్యకండి, పులుసుంది ఇవ్వకేంచేస్తుంద ... నే చెప్పిన అంకీమీద అలా నిలబడండి. ఇచ్చేట్టు నేను చూస్తాను ... తమరిక్ మరుతీసుకోండి. మాదిమాకు పారేయండి."అంటూ ప్లీడర్లదగ్గర ఊదరబెడ్తారు. ఇది ఎంతటి విషవలయాలపుట్ట అంటే ఒకప్పుడు దోసిళ్ళతో ఫీజులిచ్చి పెద్దపెద్దప్లీడర్లనే యెట్టినవాళ్లయినా ఫీజులకింద పిల్లల్నమ్ముకోవటమో లేదా ప్లీడరింట్లో అంట్లుతోమటమో చేసేస్థితికి దిగజారుతారు. మధ్యవర్తుల, జామీనుదార్ల పెన్నుపోట్లు తెలిసీ ఆ విషవలయంనుండి బయటపడలేనిస్థితి యేర్పడుతుంది.

నిమ్నవర్గీయుల మనస్తత్వంగురించి రెండుముక్కలు– ఎన్ని ఇబ్బందుల్లోఉన్నా వాళ్ళదొకటే Motto, ఒకటే ఆదర్శం: "పొరకరికష్టంమీద పొకరు బతగ్గూడదు." "నీ కష్టం నామీదెందుకుండాల"అనేది వాళ్ళతత్వం. ఇండ్లల్లో అంట్లుతోమో లేక ఆఖరికి పిల్లల్నమ్ముకునో రుణం తీర్చుకుంటారు. ఒకరికి రుణపడిఉండటం వాళ్ళస్వభావానికి విరుద్ధం. వీళ్లకు ప్రపంచమొక పద్మవ్యూహమనీ అందులో పరమకిరాతకులైన షావుకార్లుంటారనీ తెలుసు. అయినా వ్యక్తిగతంగా ఏమీ చేయలేనిస్థితిలో ఉంటారు. ఎంతటి మేధావీ "తప్పని సూచించి సెప్ప"జాలని నిజాలు తెలుసు "నోకం" గురించి.

ముత్తేలమ్మ లోకపుపోకడనుగురించి చేసిన వ్యాఖ్యానంలో ఒక్క అక్షరమూ తగ్గించడానికి వీలులేదు. అందుకే దీర్ఘంగా ఉన్నా. వీరి ప్రపంచపు పోకడనుగురించిన నిశిత పరిశీలనాదృష్టికి ఉదాహరణగా పూర్తిగ యిస్తున్నాను

"ఈనోకంల డబ్బా యాపారంతప్ప మరేట్నేదు పసువులనోర్లేనిసొమ్ములు-ఆటికి నీతుంది. కాని మనకినేదు. నదువులేన్దాన్ని నాకూనేదు. నమువుకున్నోడివినీకూ నేదు. డబ్బుకోసరం నోకం నోకంవంతా పడుచుకుంటోంది. డబ్బుకి నేను సారాఅమ్ము తున్నాను డబ్బుకి నదివిన నదువంతా నువ్వమ్ముతున్నావు. డబ్బుకి పోలీసువాళ్లు నాయ్యేన్నమ్ముతున్నారు. మందుకోసరం పెద్దాసుపత్రికెళ్తే అక్కడ మందులమ్ము తున్నారు; మంచాలమ్ముతున్నారు. లంజెలు రోడ్లంట. రిచ్చాలంట. కార్లంట తిరిగి ఒళ్ళమ్ముకుంటున్నారు గుళ్లోకెళ్ళి కొబ్బరికాయసెక్కా. కానడబ్బొఇస్తే అదేవుడిదయే అమ్ముతున్నారు. వోట్లొస్తే పీడరుబాబూ. వోట్లొస్తే నువ్వూ. నేనూ, ఈ బాబూ అందరం అమ్ముడయిపోతున్నాం. అమ్మకం! అమ్మకం! అమ్మకం! అమ్మకంతప్ప మరేట్నేదీ నోకంలో, నానునదువుకోనేదుగాని, సూసినసత్తెం మాత్తరంఅది " దిమ్మ దిరుగుతుందిపో. ఈ మాటలకు, ఈ శైలికి ఎక్కడిదీబలం??!! చాల సింపుల్, నిజం: జీవితాన్ని గురించి దొసుగులొసుగుల్లేని నిజం.

ముత్తేలమ్మ సిన్నప్పుడు కూలికిపోయేది. ఇందల నీచెంలేదని తెలుసుకుంది. దబ్బాశెపడి సారాయాపారంలోకిదిగింది. కాని ఏటిబావుకుంది. నా సారాయాపారం నా కొంపదీసింది అని తెలుసుకున్నది. పశ్చాత్తాపపడ్డది. సారాటూబులూ గాజుగలాసులూ దాసుకున్నానుగాని కన్నకూతుర్ని దాసుకోలేకపోయానే అని గుండెలవిసేటట్లు విలపించింది. యాపారాల్తో. అమ్మకాల్తో. మాయకోర్దుల్తో షావుకార్ల రాజ్యంలో మానవత్వం నశిస్తుందేతప్ప. మనిషికీ మనిషికీ మధ్య అగద్తలూ అసమానతలూ పెరుగుతాయేతప్ప. ప్రజల జీవితం మెరుగుపడదు.

ముత్తేలమ్మమూర్తివద్ద వెళ్ళబోసుకున్నసొద హృదయవిదారకమైనది. One of the great passages in all literature. నిజమే. It's quite true; but how could it be what it is? (That is our prime concern ) Is it because that is "Nature to advantage dressed?"- No, certainly not; it is all owing to fusion of form and the supreme content, the life of the lowly (down trodden) and the lost. ఇలాంటి passage రాయటం జీవితాన్ని గురించిన అవగాహన అంతగాఢంగా ఉన్నవారికి తప్ప మరొకరికి సాధ్యపడదు.

సమాజంలోని మేధావులసంగతి: వీరు మాయనే తెలుసుకున్నారు. కాని వాధని తెలుసుకోలేదు. నిజంగా తెలుసుకోలేదా? ఈ 'మాయాప్రపంచం'లో ముత్యాలమ్మలాంటివారున్నారని వాళ్ళకి తెలియదా? తెలీదూ!: గుడ్‌గాడ్. ఎందుకుతెలీదు! వారికన్నీ తెలుసు. వారిదంతా పారమార్థికదృష్టి. అన్నీ అనుభవిస్తున్న సుఖదుఃఖ ద్వంద్వాతీతులు, హృషీకేశానికి దారితెలుసు. చిన్మయానందస్వామీ. జీవన్ముక్తానంద యోగీ తెలుసు ఇన్నివిషయాలు. ఇంతమంది 'మహానుభావులు' తెలిసినవీరికి ఇంత చిన్నవిషయం తెలీదూ?!! తెలుసు. తెలిసీ పట్టించుకోరంతే. పట్టించుకుంటే వారనుభవిస్తున్న సౌకర్యాలెన్నిటినో వదులుకోవాలిమరి.

---

(ఉప్పెన 30వ పేజీ తరువాయి)

"బాబూ, పరాశికాలు నాతోనా ఆడతన్నారు!? అల్లెవరో కమ్యూనిస్టులు– అల్లు వస్తేనేటి, రాకపోతేనేటి, నాకెందుకు బాబూ అల్లగోల?"

తీన్ కళ్ళలోకి హాన్ సూటిగా చూసేడు.

"నువ్వేదో అనుకుంటున్నావు కాబోలు. జరిగీసంగతి చెప్తాను విను. వాళ్ళనిక్కడ ఎక్కువరోజులు వుండనివ్వం. తెలిసిందా? రేపో ఎల్లుండో కొమింటాంగ్ సైన్యం నదిదాటి వచ్చేస్తోంది. పొడుగు తుపాకులూ, పొట్టి తుపాకులూ పట్టుకుని మీ కమ్యూనిస్టులంతా ఇవాళ తిరగొచ్చు. మా సైన్యం వచ్చేక చూడాలి మీ వాళ్ళ ప్రతాపం. పిట్టల్ని కాల్చినట్టు కాల్చివేస్తాం.... ఓయ్ తీన్! నీ మంచికోరి నేనొక మాటచెప్తాను. వింటావా? మనం మనం ఏనాటినుంచో ఇక్కడవుంటున్న వాళ్ళం. నా పొలంవే దున్నుకుంటానంటావా? సరే అలాగే కానీ. .."

ఒక్కక్షణం ఆగి, తీన్ ముఖంలోకి మళ్ళీ చూసేడు హాన్. యజమాని మాటలు తీన్‌మీద పనిచేసేయి. దళంవాళ్ళు ఎక్కువరోజులు వుండరనేసరికి నిజంగానే భయం పట్టుకుందతనికి. ఎప్పుడూ రెక్కలు ముక్కలు చేసుకుంటున్నా, వెదవబతుకేఅయింది తీన్‌ది. అతని నుదుటి ముడతలమీద చెమట బిందువులు చేరేయి.

"....కాని, ఒళ్ళు జాగర్తగా వుంచుకోవాలనుకుంటేమాత్రం ఆ కమ్యూనిస్టుల గోల పట్టించుకోకు. వాళ్ళెవ్వైనా ప్రశ్నలూగటాపేస్తే 'నాకేం తెలీద'ని చెప్పు" అన్నాడు హాన్ మళ్ళీ.

సంభాషణ ఇంతదాకా రానిచ్చి, తీన్‌ని అప్పుడు (కింద) కూచోమన్నాడు ఋగత. మళ్ళీ మొదలెట్టేడు: "మనం ఇవాల్టివాళ్ళంవా? ఏనాటినుంచో నువ్వు నన్నెరుగుదువు; నేను నిన్నెరుగుదును.... ...."

ఈ మాటంటూ వుండగానే, కొన్నేళ్ళకిందట ఈ తీన్ కూతురుకే తనుచేసిన దుర్మార్గం గుర్తుకొచ్చింది హాన్‌కి. దానిగురించి రెండుమూడు ఓదార్పు మాటలు చెప్దా మనుకున్నాడు. కాని మళ్ళీ ఎందుకో వూరుకున్నాడు. సరిగ్గా అప్పుడే తీన్‌కూడా తన కూతురుగురించే ఆలోచిస్తున్నాడు. ఆ పిల్ల ఘోరమైన చావుకి దారితీసిన పరిస్థితులూ అన్నీ— అతని మనసులో మెదిలేయి. కళ్ళలో నీళ్ళునిండేయి. పెదాలు వణికేయి. తమాయించుకోడానికి ప్రయత్నించేడు.

తీన్‌ని ఈ స్థితిలో చూసేడు హాన్. వెంటనే తన పెదాలమీద చిరునవ్వుని చెరి పేసుకొన్నాడు

"సరే. పోరా! పో!! అంతలేసి తెలివితేటలు నీకే వుంటే, మేం‌వేనేం‌విటి తక్కువ తిన్నది! పో. పోయి. ఆ వెధవల్తో చేరు. చూద్దాం ఎవడిమాట నెగ్గుతుందో? పో!! "

కుడిచేతిని కోపంగా గాలిలో ఓసారి ఆడించి. "పో. అవతలికి! నాలుగురోజులు పోతే. నీకే తెలుస్తుంది పోపో!!"అంటూ మొరిగాడు హాన్.

హాన్ ఇంకా అరుస్తూనే వున్నాడు. అంతలోనే "హాన్‌గారున్నారా " అంటూ ఎవరో పిలిచేరు బైటనించి.

గొంతు వెంటనే పోల్చేడు హాన్. ఠక్కున కాంగుదిగి అతనికి ఎదురువెళ్లేడు. మరోనిమిషంలో ఇద్దరు మనుషులు లోపలికి వచ్చేరు ఒకడు దుక్కముక్కలావుంటే రెండోవాడు గడకర్రలా వున్నాడు. దుక్కముక్క పేరు తుషాన్-ఫా. మంచివాడన్న పేరుకూడా వుందతనికి. ఏదో పెళ్ళిమూలంగా అతను హాన్‌కి బంధువయేడు. ఇక గడకర్రపేరు తాంగ్‌తీన్. ఏదైన వస్తువు కానీయండి. భూమి కానీయండి దేన్నైనా చాలా తమాషాగా లాక్కుని సొంతం చేసుకోగలడతను. హాన్‌కి తమ్ముడువరసవుతాడు. వాళ్ళిద్దరూ మోతుబరులు. హాన్‌తో కలిపి యీ ముగ్గుర్నీ ''దుష్టత్రియం'' అంటారు జనం. పదివేల ఎకరాలకిపైగా మాగాణిపొలం వుందివాళ్ళకి. సరే. ఊరంతటావున్న బంజర్ల సంగతి కొండపరిల సంగతీ చెప్పక్కర్లేదు. ఈ ముగ్గురికీ కలిసి ఒక సారాబట్టీకూడా వుంది. దాని పేరు "అదృష్టదేవత."

ఆకారాల్లోనేకాకుండా గుణగణాల్లోకూడా బండవాడికి బక్కవాడికీ బోలెడు తేడా వుంది. 'తు'బౌద్ధమతస్థుడు. మరి 'తాంగ్' జంతువుల్నీ, క్షుద్రదేవతల్నీ పూజిస్తాడు. భార్యకి సుస్తీచేస్తే వూళ్లోనే నాటువైద్యుల్ని పిలిపిస్తాడు'తు'. తనేమో బుద్ధుడికోవెలకి

వెళ్ళి ప్రార్థనలుచేసి వస్తాడు ఇక 'తాంగ్'గారు. భార్యకి రోగంవస్తే భూతవైద్యుణ్ణి పిలిపిస్తాడు. క్షుద్రదేవతలకి ఉపాసన చేస్తాడు. 'తు'బాగా బలిసిపోవడంవల్ల నడుస్తూ వుంటే పాపం తెగ అయాసపడుతుంటాడు. మరి 'తాంగ్' అడిగినవారికీ, అడగని వారికీ కూడా తను చాలా పేదవాణ్ణని చెప్పుకుంటూ పగరుస్తూ వుంటాడు.

'మంచి మనిషి'అని పేరు సంపాదించి, 'తు' జనానికి నీతులు చెప్తూవుంటాడు.

"ఈ జన్మలో మీరు సత్కార్యాలు చేసుకున్నారంటే వచ్చేజన్మలో సుఖపడతారు"

అయినకాడికి అన్నీ లాక్కునే ఒడుపున్న తాంగ్కూడా చెప్తాడు నీతులు. ఎవరికి? చిన్న చిన్న బుగతలకి, ఏమని? "ఈ పొలాలు వుండడం కాదు కాని ఛస్తున్నామనుకో. ఎంత ఖర్చు ఎంత ఖర్చు. సెంటు పొలం వుండీ అంటే నీకు వచ్చేన్ని కష్టాలన్నమాట!"

కమ్యూనిస్టులు ఊళ్లోకి వచ్చేరని వినగానే హాన్ దగ్గిరికి పరిగెత్తుకొచ్చేరు తూ, తాంగ్ లిద్దరూ. చడిచప్పుడులేకుండావున్న హాన్ ఇల్లంతా గడబిడగా తయారయింది. గోలగోల చేసుకుంటూ హాన్గారి భార్యా, వుంపుడుగత్తే, మేనల్లుళ్ళూ, మేనగోడళ్లూ అంతా ఆ గదిలో చేరిపోయేరు. వాళ్లు ముగ్గురూ యేదో మాట్లాడుకుంటూనే వున్నారు. ఆడవాళ్లు మధ్యమధ్యలో "అవునవును" "అదే" అంటున్నారు.

హాన్ ఆఖరికొడుకు తాంగ్ వీపుమీద ఎక్కి, అతని భుజాలమీద టప టప కొడుతూ నవ్వుతున్నాడు.

"అబ్బాయ్! దిగు దిగు" అన్నాడు తాంగ్.

"దిగరా! దిగు. మావయ్యకిచూసేవా ఎంత ఆయాసంగావుందో!" అంది హాన్ గారి భార్య నోట్లోంచి పైపు తీసి పట్టుకొని.

అవతల గది గుమ్మంతెర కొంచెం తొలగింది. వొంటినిండా నగలూ గట్రా పెట్టుకొని, మాంఛి సిల్కుబట్టలు వేసుకొన్న ఇద్దరు అమ్మాయిలు గదిలోకి తొంగి చూసేరు. వాళ్ళిద్దర్లోనూ ఒకామె హాన్గారి కూతురు. పేరు ఆయి-చింగ్. రెండో ఆవిడ అతనికోడలు. కీలుబొమ్మ ప్రభుత్వం వున్న రోజుల్లో ఈ రంగేళీ యువతు లిద్దరూ హార్బిన్కిపోయి, 'మెరిటా తారో' అనే జపనీస్ సైనికాధికారితో కొంతకాలం ఖుషీ చేసేరు. మగవాళ్ళని ఆకర్షించి, రెచ్చగొట్టి, వలలో వేసుకోడంలో ఒకళ్ళను మించిన వారొకరు. కాకపోతే, హాన్గారి, కూతురు కొంచెం మొండిది. ఇంట్లో అంతా తన ఇష్టప్రకారం జరగాలని మంకుపట్టు పడుతుంది.

బాగా పొద్దుపోయింది. ఆడవాళ్ళూ, పిల్లలూ అంతా ఎవరిగదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయేరు. భార్యని పిలిచి, ఇంట్లోవాళ్ళెవ్వరూకూడా కమ్యూనిస్టులతో మాటాడడానికి వీల్లేదని గట్టిగా ఆర్డరువేసేడు హాన్. అందరికన్నా ముఖ్యంగా వాళ్ళ పందులుకాసే కుర్రాడు—వూ ఛియా-షూ ని అసలు. ఆ సైనికులుదిగిన స్కూలువైపుకికూడా వెళ్ళనివ్వకూడదని చెప్పేడు.

"మనం చెప్పినమాట వినకుండా వాడు వెళ్తానన్నదా? కీసికెళ్ళి గుర్రాల సాలలో కట్టిపడెయ్యండి వెధవని?"—అనికూడా చెప్పేడు.

ముందు జాగ్రత్తలకోసం చెయ్యవలసిన ఆజ్ఞలన్నీ జారీచేసే మళ్ళీవచ్చి తూ, కాంగ్‌లపక్కన కూచున్నాడు హాన్. వాళ్ళు ముగ్గురూ కాంగ్‌మీద కూచునివున్నారు. వాళ్ళముందు ఓ పెద్ద ఎర్రబల్ల వుంది. పొడుగాటి దీపం ఒకటి మీదనించి వేలాడుతోంది. ఆ దీపంవెలుగులో— గది గోడల నీలంరంగూ; గోడలాని వున్న పువ్వుల బొమ్మలూ; ఆ ఎర్రటిబల్లా; ఎప్పటిదో ఇక్ష్వాకులనాటి దంతపు విగ్రహం ఒకటీ; సరే, దుష్టత్రియం ముఖారవిందాలూ —అన్నీ స్పష్టంగానే కపిస్తున్నాయి మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్యలో హాన్ లేచివెళ్ళి, కిటికీతెర తొలగించి ఎవరైనా అవతల వున్నారేమో చూస్తున్నాడు. బైటంతా ప్రశాంతగావుంది, ఆకాశం నిర్మలంగావుంది, చుక్కల మిలమిలలు చక్కగా కనబడుతున్నాయి, ఎక్కడా అలికిడిలేదు.

మోతుబర్లు ముగ్గురూ అలా అర్ధరాత్రిదాకా మంతనాలు సాగిస్తూనే వున్నారు. ఆఖరికి యేదో తేలినట్టుంది; 'ఇక పోతాం'వని లేచేరు ఇద్దరూ. వాళ్ళిద్దరికోసం రెండు పెద్ద లాంతర్లు వెలిగించమని పురమాయించేడు హాన్. కాని మళ్ళీ ఎందుకనో వాటిని లోపల పెట్టించేసేడు.

ఆ చీకటి దారులవెంట ఒకడు తూర్పు దిక్కుగానూ, మరోడు పడమరదిక్కుగానూ వెళ్ళిపోయేరు. ఊరవతల కుక్కలు భయంకరంగా మొరుగుతున్నాయి.

హాన్‌గారి ఇంట్లో— గుర్రాలసాలలో గునపాల్తోనూ, పారల్తోనూ మట్టి తవ్వుతున్న చప్పుడు వినిపిస్తూనే వుంది— తొలికోడి కూసేదాకా యింకా సాంతం తెల్లారలేదు— నాలుగ్గుర్రాల రబ్బరు టైర్లబండి ఒకటి, నిండా సామాన్లతో, పట్నంకేసి పోతోంది.

ఆ ముందురోజు ఓల్డ్‌సన్ ముఖంమీద బురద తుళ్ళించింది ఆ బండే.

# పుణ్యభూమీ కళ్లు తెరు - ఒక పరిశీలన

బి. తారకం

నవలలు చదివి నవలలు వ్రాస్తారు కొందరు, జీవితాలగురించి విని నవలలు వ్రాస్తారు కొందరు, జీవితాలుచూసి నవలలు వ్రాస్తారు మరికొందరు. బీనా దేవిగారు జీవితాలుచూసి, వాటిగురించి విని వ్రాసినట్లున్నారు ఈ పుణ్యభూమీ కళ్ల తెరు/హేంగ్ మీ క్విక్ అనే నవల. తెలుగు రచయితలగురించి ఒక అభిప్రాయంవుండేది ఒకప్పుడు-వాళ్లు ఇంగ్లీషులో ఆలోచించి తెలుగులో వ్రాస్తారని. మరి ఆ అభిప్రాయం యిప్పటికి వుందో లేదో తెలియదుగాని బీనా దేవిగారు ఇంగ్లీషులో ఆలోచించి వ్రాసివుంటారు(నవల పేరు సూచిస్తున్నది!) ఈమె జీవితాలుచూసి, విని వ్రాసివుంటారని ఎందుకన్నానంటే రెండురకాల సంఘటనలూ వున్నాయి. అయితే యీ నవల యెవరికోసం, ఎందుకు వ్రాసింది- అనేది సమస్య. ఆమెకు తెలిసిన రాజమ్మలాంటి, లేదా ఆమెకంటే నిర్భాగ్యులూ దరిద్రులగురించి వ్రాసిందా, లేక అమెరికా దొరగారి మానసిక విశ్లేషణ-సంఘర్షణగురించా లేక ఒక రాణీగారితో ఆయన ప్రణయ ప్రహసనం గురించా లేక ఒకానొక స్వాములవారి గురించా? ఎవరిగురించో సరిగ్గా తెలియదు, అందరిగురించీ కాకూడదు, ఎందుకంటే వేరు వేరు వర్గాలవారికి వేరు వేరు అవసరాలుంటాయి. వేరు వేరు సందేశాలుంటాయి. అయితే ఆమె చివరిలో ఒకమాట అన్నారు. మనదేశంలో ఆకలిపశువుల్లా బతుకుతున్నంతమంది ప్రజ ఏచోటా ఏకాలంలోనూ లేరని, అందరికీ అన్నం దొరకడంలేదని, దొరకాలంటే ఈవ్యవస్థమారాలనీ, మారాలంటే ఇప్పుడున్న పరిస్థితులు పోవాలనీ, పోతాయనే నమ్మకం (ఎలాపోతాయి!) తనకున్నదనీ ఈ పుణ్యభూమి కళ్లు తెరుస్తుందనీ వ్రాశారు- చివరిలో జైహింద్! ఈ మాటలు చెప్పడానికి ఈ నవల వ్రాసిందా పోనీ అంటే అదీలేదు- ఒకరకమైన బతుకుని వాటిలోని కష్టాలను ఎత్తిచూపాలని వ్రాసినట్లున్నారు. కేవలం ఒక విషయాన్ని ఉటంకిస్తే ప్రయోజనం లేదు. గుణాత్మకమైన విమర్శచేసి నిర్మాణాత్మకమైన ముగింపు యిచ్చివుంటే ప్రయోజనం వుండేది.

కథగురించి చెప్పేముందు పేరుగురించి కొంచెం చెప్పాలి. నవల పేరు పుణ్యభూమీ కళ్లు తెరు-హేంగ్ మీ క్విక్ అని. పుణ్యభూమి అంటే వారేదో అర్థంచెప్పారు. పుణ్యంఅంటే ఏమిటి? ఏ "కొత్తదేముడు" వచ్చినా గుండెవిప్పి అందులో ప్రతిష్ఠచేసింది. ఏ కొత్తమతం వచ్చినా చేతులుచాచి ఆహ్వానించింది. అందుకు పుణ్యభూమి అయిందా?

ఎందుకలా చేసిందో బీనాదేవిగారికి తెలియదు అనుకుంటాను. కొత్తదేముడికి స్థానం యివ్వడంగురించి యిక్కడ వ్రాయడం యెందుకుగాని ఏ కొత్తమతం వచ్చినా చేతులు చాచి ఆహ్వానించింది అనేది మాత్రం నిజం కాదు. ఎందుకంటే యిక్కడకు వచ్చిన కొత్తమతాలు ఈ దేశాన్ని జయించి పరిపాలించిన ప్రభువులు పట్టుకొచ్చారు. బలవంతంమీద, తప్పనిసరయ్యి అంగీకరించినట్టివి. మతాన్ని అంగీకరించినవారు ప్రభువుల బలవంతాన్నో లేక డబ్బుకి ప్రాపకానికి ఆశపడో లేక కొన్ని సాంఘిక నియమాల నుంచి తప్పుకోవాలనో వెళ్ళినవారు. కొత్తసిద్ధాంతాన్ని ఆమోదిస్తుంది కొత్త మలుపులు తిరుగుతుంది అన్నారు ఇవన్నీ కళ్లు తెరిచాక చేస్తుందా? పుణ్యభూమి కళ్లమూసుకొని వుందా ప్రస్తుతం? కొత్తని ఆహ్వానిస్తుంది కాబట్టి పుణ్యభూమి ఎలా అవుతుంది? ఇది కొత్త పుణ్యమా? పోనీ వ్యంగ్యం అనుకుందామా అంటే అదీ లేదు. ఇది పుణ్యభూమి అని వారు అంగీకరించారు- కారణం వేరుచూపించినా, ఏదో ఒక ఆవేశం కనిపిస్తుంది తప్ప అవగాహన కన్పించడంలేదు.

కథగురించి పోయేముందు ఒకమాట. శైలిగురించి మాట్లాడితే చలంగారికిమహా చెడ్డకోపం. శైలి బాగుంది అంటావు ఎవడిక్కావాలి నీ బోడిశైలి, వస్తువు గురించి ఏమీ మాట్లాడవేం అనేవాడాయన. మరి బీనాదేవిగారు యేమంటారో తెలియదుగాని ఈమె శైలిగురించి చెప్పవలసినవి కొన్ని వున్నాయి. శైలిగురించి చెప్పేముందు భాష గురించి ఒకమాట. శ్రీ శ్రీ అన్నట్టు భాష రెండురకాలు- ఉన్నవాడిభాష, లేనివాడి భాష, ఈ రెండుభాషలూ ఈమెకు వచ్చు. వ్రాశారుకూడా. కాని లేనివాడిభాష వ్రాసేటపుడు మాత్రం ఈమె ప్రతిభ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. లేనివాడిభాషను చాల అద్భుతంగా పట్టుకున్నారామె. ఆ భాషలో చాల గొప్పతనం వుంది. లేనివాడిభాష పలువురి బాష, ప్రజల భాష, జీవభాష. జీవం అందులో వుండటట్టే అంత ప్రతిభా వంతంగా, శక్తివంతంగా, వేడిగా, వాడిగా, తీవ్రంగా వుంటుంది. ఉన్నవారి భాష వ్రాసేటపుడు చాల తేలికగా, పేలవంగా, డొల్లగా వచ్చింది. ప్రజాభాష చాల బాగా వ్రాసింది అని చెప్పడానికి పుస్తకంలో అనేకచోట్ల పదునైన నిదర్శనాలున్నాయి. రాజమ్మనో, సింహాచలాన్నో, గవర్రాజునో, అప్పలనరసమ్మనో, పోలీస్‌కానిస్టబుల్నో కదిలించి చూడండి- ఉన్నవారిభాష లేనివారి భాషల్లో దేనిని ప్రతిభావంతంగా వ్రాయగలిగింది చెప్పాలంటే ఒక ఉదాహరణ యిస్తాను: పిల్లాడికి ఏమీ పెట్టలేకపోగా చివరకు గేదెకుకూడా గడ్డివేయలేనిస్థితిలో మొగుడితో రాజమ్మ అనేమాటలు- పెళ్లాన్ని, పిల్లల్ని పోషించలేని ప్లీడరు భార్య శకుంతల భర్తతో అనలేని మాటలు చూడండి- మీకే తెలుస్తుంది.

ఇక శైలిగురించి: ఈమెకు ఉపమానాలు వాడడం చాలా యిష్టంలాగుంది. అడుగడుక్కీ ఉపమానాలు విశాఖసముద్రం అలల్లాగా– ఉపమానాలుచూస్తే రచయిత్రికి పెద్ద అనుభవమూ మంచి పరిశీలనా వున్నట్టు తెలుస్తుంది. అన్నీ సందర్భోచితంగానే- కొన్ని కొరడా తీసుకు కొడతాయి, కొన్నింట్లో చెంప ఛెడేలు మనిపించేతత్వం, కొన్నింట్లో పండిన అనుభవం, కొన్నింట్లో నిశితమైనపరిశీలనావున్నాయి. అన్నీ వాస్త విక జీవితానికి సంబంధించినవే. అన్నీ వాడిగానేవుంటాయి. ఈ ఉపమానాలకోసం నవల వ్రాశారేమో అన్నంత అనుమానం వస్తుంది రచయిత్రి తను వ్యక్తంచేయాలను కున్న కసి ఉపమానాలద్వారా వెలిబుచ్చింది.

కథగురించి– ఒకానొక రాజమ్మగురించి వ్రాసిందా లేక రాజమ్మలాంటి నిర్భా గ్యులు దరిద్రులగురించి వ్రాసిందా? ఒక వ్యక్తిగురించి వ్రాసిందా? ఒకవర్గ ప్రతినిధి గురించి వ్రాసిందా? ఒక వ్యక్తిగా తీసుకొని వ్రాసిందంటే పేచీ ఏమీలేదు. ఒక వర్గా నికి ప్రతినిధిగా తీసుకొని వ్రాసిందంటేమాత్రం (అనే అనుకోవాలి ఆఖరిమాటలుబట్టి) ఆ వర్గానికి న్యాయం చెయ్యకపోగా అపకారంచేసిందని మాత్రం చెప్పాలి. ఒకవర్గానికి ప్రతినిధిగా ఆమెను తేలేకపోయింది. ఆపాత్ర పరిణామంలో చాలలోపం కన్పిస్తున్నది. ఒకవర్గానికి ప్రతినిధిని తీసుకున్నప్పుడు ఆ వర్గ లక్షణాలు వ్రాయాలికాని వైయక్తికంగా వ్రాయకూడదు. రచయిత్రి చేసిన పొరపాటు యిది. ఆమె విఫలమయిందికూడా యిక్కడే.

రాజమ్మ ఒక సామాన్య పేదరైతుభార్య. చాల అందంగా వుంటుంది రాజమ్మ అందాన్ని అంతగా వర్ణించి పదేపదే చెప్పాల్సిన పనిలేదు పేదవాళ్లు అందంగావుండ రనికాదు నా అభిప్రాయం. వైయక్తికమైన విధానానికి జారుకొనే లక్షణాలివి. ఒక షావుకారుచేతుల్లోపడి, మోసపోయి ఉన్నదంతా షావుకారుకి అర్పించుకొని బతుకు దెరువుకి పట్టణంపోతుంది ఆకుటుంబం. ఈ కథాగమనంలో వుండవలసినవాడి మంచి పదునులోనే చూపారు రచయిత్రి. కాని రాజమ్మ అనుభూతులు కొన్ని అస్వభావికంగా వున్నాయి. మధ్యతరగతి ఆలోచనలు ఆమెలో కన్పించాయి నరసింహమూర్తి ఆమెను బలవంతం చేసినపుడు ఆమెతో అనిపించిన మాటలు అసహజంగాను, సింహా చలంతో తన మొదటిరోజుల అనుభవం తెలుగు సినిమాలోలాగ వున్నాయి. రాజమ్మ మరోచోట గాంధీ నెహ్రూల గురించి మాట్లాడడమూ అంతే. ఇవన్నీ మధ్యతరగతి బలహీనతలు, రాజమ్మ వర్గలక్షణాలు లేవు.

పట్టణం వచ్చాక రాజమ్మమొగుడు రిక్షాలాగుతాడు. కొన్నిరోజులకి తనూ పని చేయాల్సిన అవసరాన్ని చెప్పి రాజమ్మ పనిలోకి వెళ్తుంది. ఇక్కడనుంచి రాజమ్మ

మరోతరగతికి ప్రాతినిధ్యం వహిస్తుంది. పల్లెటూరి రాజమ్మ వేరు, పట్నంలో పని చేసేరాజమ్మ వేరు. రాజమ్మ ప్రిన్సిపాల్‌గారింట్లో పనిచేస్తుంది. ప్రిన్సిపాల్ భార్య క్లబ్బులంటపడి వేరేమగాళ్లతో తిరిగి గర్భవతయి (ఆమెకాకూడదు, ఎందుకంటే ప్రిన్సి పాల్‌గారు ఆపరేషన్ చేయించుకున్నాడు) భర్తకు తెలుస్తుందని ఆత్మహత్య చేసుకుం టుంది. దీనిని అనేక వివరాలతో చెప్పారనుకోండి. ఈ ఉదంతం కేవలం రాజమ్మను ప్రిన్సిపాల్‌గారికి దగ్గరగా తీసుకురావడానికి కూర్చినట్టువుంది. రచయిత్రి చేసిన పెద్ద పొరపాటు ఏమంటే– రాజమ్మ ప్రిన్సిపాల్‌దగ్గర పడుకుంటుంది. ఇక్కడే రచయిత్రి లో సదుద్దేశం కన్పించడంలేదు. ఒకానొక సందర్భంలో ఒకానొక భార్య పోయిన, బాధను అవమానాన్ని దిగమింగడానికి తాగుడుకు అలవాటుపడిన ప్రిన్సిపాల్‌గారితో ఒకానొకరాత్రి ఒకానొక రాజమ్మ పడుకున్నదా లేదా అన్నదికాదు ఇక్కడ ప్రశ్న– అటువంటిది జరిగితే జరిగివుండవచ్చు కాని రాజమ్మ ఇక్కడ ఒక పనిమనిషి, పని మనుషుల తరగతి ప్రతినిధి. అన్యాయమైన ఈ వ్యవస్థలో దోచుకోబడుతున్న పని మనుషులకు ప్రతినిధి. ఆమెను పట్టుకొని ప్రిన్సిపాల్‌దగ్గర పడుకోబెట్టడం రచయిత్రి అన్యాయం చేయడంకాదా? ఇప్పటి వ్యవస్థలో ఒక ఆడది ఎందుకు పరాయిమగాడితో పడుకుంటున్నది? ఎందుకు వ్యభిచరిస్తున్నది? ఏ కారణాలు, ఏ పరిస్థితులు ఆమెను ఆ ఊబిలోకి దింపుతున్నాయి? ఏ పరిస్థితుల ఒత్తిడివల్ల వారాపనిచేస్తున్నారు? ఇవి ఆలోచించకుండా ఈ పరిస్థితుల అవగాహనలేకుండా కేవలం మధ్యతరగతి లేదా ఆపై తరగతి మనస్తత్వంతో వ్యక్తిగతమైన సానుభూతి, జాలి(అది ఒక వర్గానికిఉన్నజబ్బు) చూపి రాజమ్మను ఆపనిచేయించడం సరయినపాత్రపోషణకాదు. ఆ సంఘటన జరుగు తుందా లేదా అన్నదికాదు ప్రశ్న– అసలది వ్రాయడంలోని వుద్దేశం ఏమిటి? అసలు సమస్య, దానికి దోహదంచేసేపరిస్థితులు, కారణాలు ఏమీ రచయిత్రి ఆలోచించినట్టు లేదు. ఆర్థికమైన యిబ్బందులు మనిషిని కిందికి జార్చుతాయి– మానసికబాధలు కాదు అవి గొప్పవారివర్గానికి– పరిస్థితులు అందరినీ ఒకేలా ప్రభావితంచేయవు. ఆ తేడాలు రచయిత్రి గమనించినట్టులేదు.

సింహాచలానికి కాలుపోవడమూ అంతే. ఆ పాత్రపోషణ చేయలేక కాలువిర గ్గొటినట్టువుంది. అంటే ఆ సంఘటన జరగదనికాదు. రిక్షా తొక్కుతుంటూ కష్టప డుతూకూడా కష్టఫలం చాలకో లేక అందకో బతుకు దుర్భరంగా సాగిస్తున్న కష్ట జీవులగాధలు రచయిత్రికి తెలియవా? అతనికాలు విరగ్గొట్టడం, భార్య సంపాదనమీద ఆధారపడడం. అక్కడనుంచి అనుమానాలు, వేరేతరగతి మనుషుల స్వభావాలను అరువు తెచ్చుకోవడాలు– ఇవన్నీకూడా ఒకటి చెప్పాలని మొదలుపెట్టి మరొకటి చెప్ప కుపోవడం. కథ యెటుపోతే అటులావున్నది. రచయిత్రి అనుకొని ఒక ఆలోచనా

బద్ధంగా కథను నడిపించినట్టు కన్పించదు. ఒకరకమైన ఆర్థిక వ్యవస్థలో శ్రామికులు దోపిడీకింద పేదరికంకింద ఎలా నలిగిపోతున్నారో చూపక మామూలుకథల్లా భర్తపని చేయలేనిస్థితి, భార్య సంపాదనపై ఆధారపడడం అనుమానాలు, ఇవన్నీసృష్టించడం చూస్తే రచయిత్రికి అసలు ఆ పాత్రలను ప్రవేశపెట్టడంలో ఒక ప్రయోజనంవున్నట్టు కన్పించడంలేదు.

అనుమానాలు. అవమానాలు. బాధలు తిరగాల్సిన మలుపులు తిరుగుతాయి. చివరికి పోగా పోగా– రాజమ్మను లంజ అంటారు, రాజమ్మ హత్యచేసింది అంటారు. అందరూ అంటారు. మొగుడూ అంటాడు. రాజమ్మ పోలీస్‌స్టేషన్‌కీ వెళ్ళవస్తుంది. కాని రాజమ్మ ముండలకంపెనీకే వెళ్ళడం మాత్రం ఆ పాత్రకు అపచారమే! మళ్ళీ అదే సమస్య వస్తుంది. ఒకానొక రాజమ్మ కొడుక్కి మందుకొనలేక వ్యభిచరించిందా లేదా అన్నదికాదు సమస్య. 'ప్రయత్నిస్తే ఆమెకు పని దొరక్కపోదు' అని తెలిసిన రాజమ్మ పనికోసం ప్రయత్నంచేయక వ్యభిచరించడానికి అందులోనూ ముండల కంపెనీకి ఎలా వెళ్ళింది? వ్యభిచారగృహాలున్నాయని, ఆడవాళ్ళను సరఫరాచేసే కంపెనీలున్నాయని వ్యభిచరిస్తే కష్టపడి పనిచేసేకన్నా ఎక్కువడబ్బులు వస్తాయనేజ్ఞానం ఆమెకు ఆపాదించినట్టేకదా! ఒక పాత్రను ఒక ఘోరమైనస్థితికిగాని, నేరానికిగాని, వ్యభిచారానికిగాని ఆ పాత్ర ప్రమేయంలేకుండా ఆమెచుట్టూ జరుగుతున్న సంఘటనలు తీసుకు వెళ్లాలిగాని పూర్వజ్ఞానంతో అపని చేయడమనేది సరైనపాత్రచిత్రణకాదని నా ఉద్దేశం. ముఖ్యంగా ఒక వ్యవస్థకు సంబంధించిన పరిస్థితులలోని పాత్రలను తీసుకున్నప్పుడు కొంచెం జాగ్రత్తపడాలి. వైయక్తికంగా పాత్రను తీసుకువెళ్తే అది ఆ వర్గానికి పాత్రకు అన్యాయంచేసినట్టు అవుతుంది. ముందే చెప్పాను. ఫలానిపరిస్థితుల్లో ఫలానిరాజమ్మ వ్యభిచరించిందా లేదా అన్నదికాదు సమస్యఅని.

సరే చివరకు రాజమ్మ అమెరికా దొరగారిదగ్గరకు వెళ్ళడం, ఆయన ఆమెను ఏమీ చెయ్యకుండా బోలెడన్ని డాలర్లు ఖరీదైన వస్తువులు ఇచ్చి పంపేయడం– అతని గొప్పతనం. అతనిలో నైతిక పునఃప్రతిష్ఠ ఇక్కడ ఎందుకు వ్రాయాలో అర్థంకాదు– ఆ తర్వాత చాల విచిత్రంగా ఆయన చనిపోవడం, హత్యానేరం రాజమ్మమీదపడడం, ఆమెను జైల్లో వేయడం జరుగుతుంది.

అమెరికా దొరగారిని తెల్లారి పోస్ట్‌మార్టమ్‌చేయిస్తే అది హత్యో ఆత్మహత్యో తెలిసిపోయేదిగదా! హత్య కాదుగాబట్టి రాజమ్మను పోలీసులాకప్‌లో పెట్టి స్థలాలు మార్చినా నానా హింసలుపెట్టే అవసరంవుండదు. మహా అయితే దొంగతనం నేరం. అలాకాక మరెవరైనా చంపివున్నట్లయితే– ఎవరా హంతకుడు? చిన్నసైజు అపరాధక

పరిశోధకనవల తయారవుతుంది. ఈ ముగింపులో ఎందుకింత గందరగోళం? రాజమ్మ పేరు అమెరికా పత్రికల్లో పడాలనా? లేక 'హేంగ్ మీ క్విక్'ని సమర్థించుకోడానికా? ముగింపు ఏదో డ్రమెటిక్‌గా యివ్వాలని ఉద్దేశమేమో। ఈ ముగింపు యివ్వడంద్వారా ఏంచెప్పదలుచుకున్నారు రచయిత్రి? ఏ ప్రయోజనాన్ని సాధించారు?

కథకు ఏమాత్రమూ సంబంధంలేని కథాగమనానికి అడ్డుతగిలి విసుగనిపించే ఈ అమెరికా మహాశయుడు కేవలం ఒక రాత్రి రాజమ్మకు డబ్బిచ్చి చనిపోయి తద్వారా ఆమెను జైల్లోకి పంపడానికి కారణభూతుడు కావడానికి యిక్కడికి వచ్చాడా? వ్యభిచారానికి సిద్ధపడినా ఆ కష్టఫలంకూడా సరిగా దొరకకుండా పోయే సన్నివేశాలు రచయిత్రికి తెలియవా? రాజమ్మ జైల్లోవుండి నన్ను త్వరగా ఉరితీయించమని అడుగుతుంది. దేనికి ఆమె పశ్చాత్తాపపడుతున్నది? ఏరకమైన అవగాహన ఆమెకు వచ్చింది? ఆమెలో ఓటమి కనిపిస్తున్నది. కొన్ని రోజులక్రితం ఆమెలో పలాయనవాదం కనిపించింది— ఎక్కడికో ఏ కష్టాలూలేని ఏ అడవిలోకి కొడుకుని తీసుకొని పారిపోతే అనే భావం వస్తుందామెకు తన కొడుకుని చంపేయమని భగవంతుణ్ణి వేడుకుంటుంది— విచిత్రం। ఇది ఏ తరగతికి చెందిన మానసిక బలహీనత? ఇవన్నీ రాజమ్మకు యెందుకు అంటగట్టడం?

ఒక గొప్ప వాస్తవికతను చెప్పడానికి కథ మొదలుపెట్టి మధ్యలో ఏంచేయాలో తెలియక నానాగందరగోళంచేసి చివరలో ఏమిచెప్పాలో తెలియక ఒక డ్రమెటిక్ సంఘటనకల్పించి ఆమెను జైల్లో పారేశారు రచయిత్రి—

అదలావుండగా కథావస్తువుకి ఏమాత్రమూ సంబంధంలేని స్వాములవారు, అమెరికా దొరగారు ఇక్కడిదే మహారాణిగారు యీ పిడకలవేట యెందుకుచేశారో రచయిత్రి అర్థంకాదు ఏమాత్రమూ అతకనికథ పీకిముగ్గురిదీను. అసలు యెవరో వ్రాసి ఈ కథలోపెట్టి అతికేశారేమో అన్నట్టువుంది. రాజమ్మకథకూ రాణీగారికథకూ ఏమాత్రమూ పొందికలేదు. భాషవేరు, భావంవేరు, శైలివేరు. బహుశా రచయిత్రి చిన్నప్పుడు వ్రాసుకున్నది ఇందులో పెట్టేసి మరీ బాగుండదని చివరలో రాజమ్మను ఈయనదగ్గరకు పంపిస్తే అతుక్కుంటుందని అనుకొనివుంటారు. అంతకుమించి ఏమీ లేదు. వాళ్ళకథవున్న పేజీలు అన్నీ తీసేసి వేరేనవలగా ప్రచురించుకోవచ్చు. ఇందులో మామూలుగా ఇప్పటి తెలుగు నవలల్లోకనిపించే విరహాలు, నిట్టూర్పులూ, అన్వేషణా పరిణయసన్నివేశాలు, ప్రేమకోసం ఆరాటం, పెద్దకార్లు, దివ్య భవ్య హర్మ్యాలు, పార్టీలు వగైరా వగైరా అన్నీ వున్నాయి.

కోర్టులగురించి వ్రాసిన భాగమూ అలాంటిదే. కోర్టులో పేదవాడికి న్యాయం జరగదని అది డబ్బున్నవాళ్లకేఅని అక్కడ న్యాయమే అదొకరకమని చెప్పడానికి అన్ని వివరాలు అక్కర్లేదు రచయిత్రి ఎంత వివరంగా పోయారంటే ఆమె అడ్వొకేట్‌గా ప్రాక్టీసుచేస్తుంటేతప్ప తెలియని ప్రొసీజరల్ వివరాలు వ్రాశారు. ఆమె బహుముఖ ప్రజ్ఞాపాటవాన్ని ప్రదర్శించుకోవడం తప్పిస్తే మరోప్రయోజనంలేదు అందులో. కోర్టు గురించి సింహాచలం చెప్పినా గవర్రాజు చెప్పినా మరోకుర్రప్లీడరు చెప్పినా రా. వి. శాస్త్రిగారికంటే గొప్పగా ఏం చెప్పలేదు. సింహాచలంకేసు అంత వివరంగావ్రాయడం పురుషోత్తం వారి జూనియర్ విమల ఉపాఖ్యానం— జూనియర్ల అవస్థలు వర్క్ ఎలా సంపాదించాలోఅని శివరాం లెక్చర్— ఇవన్నీ కథాగమనానికి కథపుష్టికి ఏ మాత్రమూ తోడ్పడవు. సరికదా అనవసరం. సందేహంలేదు— ఇవన్నీ చాలా పదునైన భాషలో వ్రాశారు చదువరులకు విసుగురాదు. పైగా ఆసక్తి ఉత్సాహమూ వుంటుంది. కాని అదా ఉద్దేశం? ఒక సన్నివేశంగాని ఒక పాత్రనుగాని ప్రవేశపెడితే దాని ప్రయోజనం ఏమిటి? దీనిద్వారా సాధించేది ఏమిటి? అని చూడాలి; కేవలం చదివించుకుపోవడం మంచి రచన లక్షణంకాదు.

కోర్టులగురించి అంత నిర్భయంగా, నిష్కర్షగా చెప్పిన రచయిత్రి పోలీసుల లాకప్‌లో రాజమ్మను ఏంచేశారో చెప్పడానికి ఎందుకు భయపడ్డారు?

హెమింగ్వే అంటాడు— మనిషిని సర్వనాశనం చేయొచ్చుగాని ఓడించలేంఅని. రచయిత్రి సరిగ్గా దానికి వ్యతిరేకం చేసింది. ఈ రకంగా రాజమ్మను ఓడించడంవల్ల రచయిత్రి ఆశయానికి (ఆఖరిమాటలో ఆమె చెప్పుకున్నదానికి)చాల విరుద్ధమైనఫలితం వచ్చింది.

కోర్టులగురించి అంత వివరంగా తెలిసిన రచయిత్రికి రాజమ్మను అలా గాలిలో వేలాడదీయాల్సిన అవసరంలేదు. టైటిల్‌కోసం ముగింపో లేక ముగింపునుబట్టి టైటిలో అర్థంకావడంలేదు. ఏది ఏమైనా బీనాదేవిగారినవల ధారావాహికంగావస్తున్న, పత్రికల కొద్దీ వస్తున్న నవలలకంటే భిన్నమైన నవల. లేనివాడిభాషలో (చాలవరకు) వ్రాసిన నవల— లేనివాళ్ళ గురించి వ్రాసిన నవల— చాల కసిలోచెప్పిన నవల. ఒకటిఅని పిస్తున్నది బీనాదేవిగారి నవలతో తెలుగునవల ఒక కొత్తమలుపు తిరిగింది. ఒక కొత్త పుంతకేసి బయలుదేరి వెళ్తుంది.

## సాహిత్య వ్యాసాలు IV

### గోర్కీ

### సాహిత్యం—వాస్తవికత (1934)

వానరుడు నరుడుగామారి సంస్కృతికి పునాదులు వేయడంలో కాయకష్టం (labour) ఎంతో గొప్పపాత్రి నిర్వహించింది. కాని ఈ పాత్రినుగురించి ఇంత వరకూ వదిలంగా, పూర్తిగా పరిశోధన జరగలేదు. చరిత్రికారులు, సంస్కృతీపరులు ఆదిమమానవుడిని వేదాంతిగానూ, మాయావాదిగానూ, దైవభక్తుడిగానూ, సత్యాన్వేషి గానూ చిత్రించారు. పాత చరిత్రను, సంస్కృతిని తెలుసుకోడానికి నిజంగా పని కొచ్చేవి తవ్వకాల్లో బయటపడే వివరాలే. ఆదిమమానవుడు బ్రితుకుకోసం పెనుగు లాడేవాడు. అలాంటప్పుడు ఊహాలోకాల్లో తేలిపోవడం సాధ్యంకాదు. ఇలా ఊహా లోకాల్లో తేలిపోవడం అనేది తరువాతవచ్చిన జబ్బే. మానవుడు ఎన్నడూ ఏకాకికాదు, ఎప్పుడూ సంఘజీవే. అందుకే అరిస్టోటిల్ అంటాడు— "మృగానికి, మహాత్ముడికి సంఘం అక్కరలేదు. మనిషికిమాత్రిం సంఘంకావాలి".

ప్రాచీన కాలంలోవున్న భౌతికవాద దృక్పధాన్నిగురించి చరిత్రికారులు మనకు చెప్పలేదు. జంతువులను మచ్చికచేయడంగురించి, మూలికలనుగురించి, పనిముట్లను గురించి ఇతిహాసాల్లోనూ, పురాణాల్లోనూ చాలారాశారు. ఆదిమ మానవుడు ఆకాశం లోకి ఎగరాలని కలలుకన్నాడు. (అందుకే గ్రీకు పురాణాల్లోలాగే, మన పురాణాల్లో కూడ హనుమంతుడు, జటాయువు, గరుత్మంతుడు మొదలైన పాత్రలను కల్పించారు) నీటికన్నా వేగంగా ఏటిలో వెళ్ళ డానికే తెప్ప, పడవ తయారు చేసుకున్నాడు. శత్రుమూకలనుంచి తన్నుతాను కాపాడుకోడానికే విల్లు, అంబు చేసుకున్నాడు. తెల్లారే లోగా ఎన్నోతానులు గుడ్డనేయాలని, పొద్దుగూకేలోగా ఇల్లు కట్టెయ్యాలని కలలు కన్నాడు. మానవుడి కలలకు, కల్పనలకు ఉదాహరణలు కోకొల్లలు. ప్రాచీన కథలు, పురాణాలు మనందరికి తెలుసు. కాని వాటి వరసారం తెల్సుకోవాలిమనం. అదంతా అనాది మానవుడు తనుపడ్డ శ్రిమ మర్చిపోవడానికి ఉత్పత్తి పెంచడానికి, ప్రికృతి భీభత్సాలనుంచి, శత్రుమూకలనుంచి తనసుతాను కాపాడుకోవడానికి చేసే ప్రియత్నాల పరంపరే. (భారతంలో భీముడు ఎంతో బలవంతుడు, సాహసవంతుడు ; అను:-). తమ ఆశలకు, కోర్కెలకు అనుకూలంగానే పాత్రిలకు రూపకల్పన చేశారు. శక్తి సామర్థ్యాలను పొగడ్డం, వాటిని గొప్పచేయడం ఇదంతా రమణీయ కళాసృష్టి.

దేవుడిని మానవుడే మూసపోశాడు. సమాజంలో మార్పులతోపాటు దేవుడి ఆకారాలుకూడా మారుతూవచ్చాయి.

పనిపాటులకు, తెలివితేటలకు పొంతనవుంటేనే మానవుడి సామాజిక, సాంస్కృతిక పురోగతి సవ్యంగా వుంటుంది అప్పుడే మెదడుచెప్పినట్లు చేతులుచేస్తాయి. చేతులు మెదడుకి పదును పెడతాయి. గతంలో శ్రమజీవుల సాంస్కృతిక అభివృద్ధి ఎందుకు కుంటుపడిందో మనందరికీ తెలుసు. చేతులను, మెదడును వేరుచేశారు. ఆచరణనుంచి ఆలోచనను విడదీశారు. కాయకష్టానికి, మానసిక శ్రమకు ఈ అవినాభావ సంబంధం లోపించడంవల్లనే గతంలో కీడు వాటిల్లింది. పనిచేసేవాళ్ళు సిద్ధాంతం సృష్టించలేక, సిద్ధాంతం సృష్టించినవాళ్ళు పనిచెయ్యక సంఘం కుళ్ళిపోయింది, తమ తెలివితేటలను ఆసరాచేసుకుని కుటిలమతులు అందలంఎక్కారు. ఇలా కొందరు అందలం ఎక్కడంవల్లనే వ్యక్తివాదం (individualism) తలెత్తింది.

సాహిత్యంలో 'మార్గ', 'దేశి'అని రెండురకాలున్నాయి. పండితపరమయింది మార్గసాహిత్యం. ప్రజాపరమైంది దేశిసాహిత్యం. అదే మన జానపద సాహిత్యం. జానపద సాహిత్యంలో నిరాశావాదానికి తావులేదు. ప్రజలు దోపిడీకి గురిఅయి, ఎన్ని కష్ట నిష్ఠురాలు పడినా, అంతా కలిసికట్టుగావుండి, ఉమ్మడి శత్రువును ఎదిరించి కవిత లల్లారు, కథలుచెప్పారు. అంతేగాని తమ కవితల్లో, కథల్లో ఏనాడూ నిరాశకు చోటివ్వలేదు.

మన పురాణాలన్నీ పుక్కిటి పురాణాలే. అయితే వాటి వెనకాల జీవితసారం దాగుంది, అనుభవం దోబూచులాడింది. ఆ అనుభవానికే రూపకల్పనచేశారు. అదే ఆ తరవాత వాస్తవికతకు దారితీసింది. రూపకల్పనకు రామణీయకతను జోడించేసరికీ అదే కాల్పనికవాదం అయింది. కాల్పనికవాదంనుంచి విప్లవ దృక్పథం ఉద్భవించింది. విప్లవ వాస్తవికతకు సమాజాన్ని మార్చేశక్తి వుంది.

ఇంతకుముందు వచ్చిన సాహిత్యాన్ని అంచనాకట్టేప్పుడు మనం చాలా జాగ్రత్తగా వుండాలి. పాత సమాజంలోని కుళ్ళు చాలామంది కడిగేశారు. (వీరేశలింగం, గురజాడ ఉన్నవ, చలం, గోపీచంద్, శ్రీపాద, మల్లాది వగైరా. అను:-) వీళ్ళ రచనల విషయంలో మనం నెగిటివ్ దృక్పథం అలవర్చుకోగూడదు. అది చాలాతప్పు. అయితే వీళ్ళ రచనల్లో మనకు సామ్యవాద మానవుడు కనిపించకపోవచ్చు. ఆనాడు సామ్యవాద మానవుడిని ఊహించలేకపోవడం వాళ్ళ తప్పుకాదు. అయినా సామ్యవాద మానవుడు సామ్యవాద సమాజంలోనే వికసిస్తాడు. సామ్యవాద వాస్తవికత శ్రమజీవులకు నివాళిపడుతుంది.

అచ్చమైన కష్టజీవే మన నిజమైన కథానాయకుడు. శ్రామికుడే సృష్టికర్త. కళలో రాశికన్నా గుణం ముఖ్యం. కళాకారులు, సాహితీపరులు ఓ సంగతి బాగా గుర్తుంచుకోవాలి. శ్రమజీవులే నూతనచరిత్రను, సామ్యవాద సంస్కృతిని సృష్టిస్తారు. శ్రమజీవులకు అంకితమయిన మనమందరం కలిసికట్టుగా వుండి ఒక్కతాటిమీద నడవాలి.

అనువాదం : చలసాని ప్రసాద్.

సమీక్ష :

## త్రిపురనేని సాహిత్యం - పరిశీలన

ఎస్. వి. ఎస్. రావు

మహాకవిగా సంఘ సంస్కర్తగా త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ఆంధ్రులకు చిరపరిచితులైనా వారి సాహిత్యాన్నంతటిని క్రమబద్ధంగా యిటీవల ముద్రించడం ముదావహమైన విషయం. వర్ణాశ్రమ ధర్మం ముసుగులో సమాజంలోని శ్రమజీవుల్ని అత్యధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజానీకాన్ని పీడించిన 'అగ్ర'వర్ణాల కుతంత్రాన్నీ, స్వార్థంతో వాళ్లు సృష్టించిన సాహిత్యాన్నీ ఖండించడానికే తమ కవితాప్రతిభను అంకితంచేసిన మహనీయుడు త్రిపురనేని. సాహిత్యాభిలాష నానాటికి పెరుగుతున్న యీనాటి సాహితీలోకానికి మనం గొప్పగా చెప్పుకొనే ప్రాచీన నాగరికతలో అనాది నుంచి కొనసాగుతున్న మోసం దౌర్జన్యం వెల్లడికావడంతోపాటు రాజకీయ పరిజ్ఞానం గల సాహితీపరులకు వర్ణవ్యవస్థకు వర్గపోరాటానికిగల అనుబంధాన్నిగూర్చి హెచ్చరిక కల్పిస్తాయి యీ గ్రంథ రాజాలు.

సుదీర్ఘమైన జాతీయోద్యమానికి ప్రతిఫలంగా భారతదేశానికి రాజకీయ విముక్తి లభించినప్పుడు అనతికాలంలోనే ప్రజారాజ్యాన్ని స్థాపించుకోవచ్చునని కలలుకన్నారు అభ్యుదయపరులు శ్రమజీవులు. అలాంటి ఊహలన్ని పటాపంచలయి భూస్వాములు పెట్టుబడిదారులు బలపడి అత్యంత హేయమైన వర్గసమాజాన్నీ నిరంకుశ పరిపాలనను నెలకొల్పడం రాజనీతినిపుణులకు దిగ్భ్రమ కల్పిస్తోంది. కేవలం ఆర్థిక జీవనమే చరిత్రగతిని నిర్ణయిస్తే బూటకపు సామ్యవాదం ప్రజాస్వామ్యంవంటి నినాదాలతో దుర్భర దారిద్ర్యానికి గురియయిన ప్రజానీకాన్ని యిన్నాళ్ళపాటు భారీయెత్తున మోసగించడం జరిగేదికాదు. అక్టోబరు విప్లవం ప్రభావంలో శ్రామికోద్యమాలు వామపక్షాలు ఏభయి ఏళ్ళకిత మే ఉద్భవించినా వర్గసమాజాన్ని కూలదోయడానికి బదులు విద్యార్థిలోకంతో

సహా మధ్యతరగతి విద్యావంతులు ప్రజలసంగతి పట్టించుకోకుండా పచ్చి అవకాశవాదులుగా జీవించడం చూస్తే వర్ణవ్యవస్థద్వారా వర్గసమాజానికి మనం అలవాటు పడిపోవడమే కారణమనిపిస్తుంది భారతీయ సామాజికచరిత్రలోను రాజకీయాల్లోను కులవ్యవస్థ పాత్రను గుర్తించి ఇక మీదటనైనా రాజకీయ పోరాటాలతోపాటు కులవిభేదాల నిర్మూలనకై శ్రద్ధ వహించడం మార్క్సిస్టుల కర్తవ్యం కవిరాజు సాహిత్యం అందుకు దోహదం చేస్తుంది, నిజానికి పాశ్చాత్యదేశాల్లో పాతికేళ్లునిలబడలేని ఫాసిస్టు సిద్ధాంతం సహస్రాల తరబడి యీ దేశంలో కులవ్యవస్థ రూపంలో వర్ధిల్లడం ఆశ్చర్యకరమైన విషయం.

ఆధునికయుగంలో సాహిత్యాన్ని సాంఘికాభ్యుదయానికి వినియోగించాలనే ఆశయంతో జరిపిన ప్రక్రియలన్నింటిలో గురజాడ శ్రీశ్రీలతోపాటు త్రిపురనేని యెన్నుకున్నమార్గంకూడ విశిష్టమైనదని గుర్తించవలసి ఉంటుంది. గాంధీపేరుతో కొన్నాళ్లు కొనసాగిన శుష్కజీవకారుణ్యవాదం పూర్తిగా నిరుపయోగమయింది, భావకవిత్వం సినిమా కవిత్వానికి దారితీసింది. శ్రీశ్రీ కృషి లిరికల్ కవిత్వాన్ని సమకాలీన సాంఘిక సమస్యలవైపు దృష్టిని మళ్ళించి ఆధునిక కవితకు పునాది కల్పించినా సాంప్రదాయరీతిలోనే ప్రాచీన సంస్కృతిని కూలంకషంగా విమర్శించి ప్రజల్లో అజ్ఞానం నశింపజేసి హేతువాదం ప్రచారం చేయదలచిన కవిరాజు సాహిత్యాన్నికూడా ఒకవిధమైన విప్లవ కవిత్వంగానే భావించాలి. రాజకీయదృష్టి లోపించడంవల్ల రామస్వామి చౌదరిగారి కృషిలో లోపాలు లేకపోలేదు. వాటినిగూర్చి తరువాత సూచిస్తాను.

కవిరాజు సాహిత్యంలో మెచ్చుకోదగ్గ విషయం నా ఉద్దేశంలో మన సంస్కృతిలోని ప్రధానాంశాన్ని గుర్తించడం. ఛందస్సులు శృంగారం యీనాటికవులు భావించినంత ముఖ్యవిషయాలు కావు సమకాలీన అభిరుచుల కనువైన మార్పులు యిలాంటి అంశాలలో సాధించడం కష్టసాధ్యంకాదు ప్రాచీన సాహిత్యంలోని కంటెంట్‌ని నెగటివ్ దృక్పథంతోకాక పోజిటివ్‌గా వాటిల్లో ప్రచారం చేసిన భావాలను యితివృత్తాలను ఖండిస్తూ సాంప్రదాయరీతిలోనే వ్రాయడం త్రిపురనేని సాహిత్యంలోని ప్రత్యేకత. ఎటొచ్చీ యీమాదిరి సాహిత్యం ఏకారణంవల్లనేమి యీనాటి పాఠకుల నాకర్షించడం కష్టం. అందువల్లనే విప్లవ భావాలుకల యువతరం వారి గ్రంథావళికి తగినంతశ్రద్ధ తీసికొని ప్రచారం కల్పించడం అవసరం.

'పాయక పూర్వగాధలని ప్రత్న కవీంద్రులు నేటిదాక, రా
మాయణ భారతాది కృతులన్నియు వ్రాసిరి త్రిప్పి త్రిప్పి....
....నూతనాంశమే

దో యొక టేనియుం దెలుప నోపని గ్రంథసమూహ మేటికో.

అని దీక్షవహించి మన ప్రాచీన సంస్కృతికి సమగ్రమైన నూతన వ్యాఖ్యానం కోసం యత్నించారు త్రిపురనేనివారు. వారికోర్కె ఎంతవరకు ఫలించిందని నిర్ణయించేముందు ప్రాచీన యితివృత్తాల విషయంలో భారతదేశం ప్రత్యేకతను గుర్తించడం ముఖ్యం. రామాయణం, భారతంవంటి యితిహాసాలు ప్రతిదేశంలోను ఉంటాయి- కాని ఐతిహాసికయుగం అంతరించాక వీటితో ప్రమేయంలేని నిర్దుష్టమైన మతాలు ఉద్భవించడంవల్ల యితివృత్తాలు సహితం అభ్యుదయ భావాల ప్రచారానికి వినియోగించుకుందికి అవకాశాలున్నాయి పాశ్చాత్యదేశాల్లో (ఉదాహరణకు షెల్లీ స్విన్‌బర్న్ కావ్యాలు). పురాణ పురుషులను దేవతలకింద భావించవలసిన అవసరం లేనందువల్ల సాహిత్యం సమకాలీన సమాజంతోపాటు పెరుగుతూ నిత్య నూతనమైన వ్యాఖ్యానాలతో సారవంతమైంది. మన దురదృష్టంకొద్దీ భారతీయ సంస్కృతిలో పురాణాలు, చరిత్ర. మతం. రాజ్యాంగం అన్నీ వర్ణవ్యవస్థరూపంలో జడాత్మకమైన వర్గసమాజంతో లీనం కావడంవల్ల ప్రాచీన సాహిత్యం యావత్తు పాలకవర్గానికీ మద్దత్తు నిచ్చింది. తమకు తామే అగ్రవర్ణస్థులమని గర్వించిన బ్రాహ్మణవర్గం ఆర్థికంగా పాలకవర్గంతోపాటు ప్రజలను దోచుకున్నా జనసామాన్యానికి విద్యను ప్రసాదించక పోవడంనుంచి ప్రజలకు దూరమై కలకాలం పాలకవర్గానికి దాస్యం చేయవలసి వచ్చింది. వాళ్లు సృష్టించిన సాహిత్యం కూడా యెందుకూ పనికిరాని రొటీను పద్ధతిలో నడిచింది. అందువల్లనే ఆధునిక యుగంలో క్లీన్‌స్లెట్‌తో ప్రారంభింపవలసిన అవసరం ఏర్పడింది. కవిరాజుగారు కష్టతమమైన రెండోమార్గాన్ని– సాంప్రదాయమనే అరణ్యంలోకి జొరబడి నిజాన్ని బయటకు తీసేయత్నం అనుసరించారు.

త్రిపురనేని గ్రంథావళినిగూర్చి స్థలాభావంవల్ల చర్చించడానికి అవకాశం లేకపోయినా అభ్యుదయభావాలకు సందర్భోచితంగా ఏ విధంగా కావ్యరూపం కల్పించారో యీక్రింది ఉదాహరణలు చూడవచ్చు.

కోతి కొండముచ్చులకును గొండలకును
మానవులు పుట్టిరని చెప్పు 'మాయమాట'
లన్ని కథలీ పురాణములందు కలవు
పిట్టకథలకు నివియెల్లఁ బుట్టినిండ్లు. (సూ.పు. 1-47)

మనదేవతలందరిలో పనికిమాలిన వ్యక్తి ఇంద్రుణ్నిగూర్చి వ్రాస్తూ

"అసమర్థుడై భీరువై ప్రతీకారంబుఁ
బచరింపజాలు నిబ్బరము లేక

మంత్రి తంత్రింబుల మాటున జవరాండ్రి
మాలిమితో బతిమాలి. యింటి
పట్టున బడినాశ్లేవి పట్టుమనుచుఁ
గుడిచి కూర్చుండనీయడీ కుత్సితుండు ..." (సూ.పు. 1-21)

అవి అతగాడి భోగంముండల చేత తిట్టించారు.

ధర్మసంరక్షకులమనీ పండితమ్మన్యులమనీ విర్రివీగిన బ్రాహ్మణులకైతే ఎలాంటి పాప కార్యానికైనా తేలికైన బోకెన్ శిక్ష చాలునని సెలవిచ్చి అజ్ఞానులైన సామాన్యప్రజలకు కఠిన శిక్షలు విధించడం ఏమిన్యాయమని యీ క్రిందిపద్యంలో వ్యంగ్యంగా ప్రశ్నించారు త్రిపురనేని

అజ్ఞాను లొనరించు నపరాధములకెల్ల
నతిమాత్రి శిక్షలు న్యాయమయ్య
జ్ఞానులొనర్చు దోషములన్నింటికి
నాప మాత్రపు శిక్ష న్యాయమయ్య? (సూ.పు. 2-27)

భావపుష్టిమాట అటుంచి రమణీయ కవిత్వం వ్రాసిన ప్రతిభావంతులనడానికి యీ క్రింది పద్యభాగం ఉదహరించాలి సాంప్రదాయరీతిలోఉన్న కవిత్వంకనుక సాంప్రదాయవాదుల సరదా తీర్చడానికి

గిల్లు కొఱుకుల పొత్తంబు నెల్లఁజదివి
యారితేరిన యామె నయ్యాటలందు
బడుగు బైరాగికెట్టులీపాట్లు తెలియు? (సూ.పు. 2-19)

చేంతాడు పద్యాలు కావలసినవాళ్ళకి అలాంటివీ ఉన్నాయి త్రిపురనేనివారి కావ్యంలో.

'గోలాంగుల లులాయసూకర తరక్షువ్యాళశుండాల శా
ర్దూలన్యంకు హరీంద్రి సాలముఖ జంతుప్రాప్త హితాలత
క్కోల వ్యాప్రితమాల శాఖ ....' (సూ.పు. 2-6)

ఈ పద్యాన్ని అర్థంచేసుకుందికి నాకు వ్యవధిలేకపోయింది. పాఠకులకేవదిలిపెడ్తున్నాను.

విప్లవ కవులు త్రిపురనేని సాహిత్యంతో పరిచయం కల్పించుకోవాలని నావంటి వాళ్ళు భావించినా అందులోని లోపాలుగూడా గుర్తించడం అవసరం. వర్ణవ్యవస్థను అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని వస్త్వాశ్రియ దృక్పథంతో ఖండించడానికిబదులు ఆత్మాశ్రయ భావానికి తావీయడంవల్ల చాలామంది పాఠకుల మనస్సు నొప్పించడమేకాక ముఖ్యోద్దే శానికి భంగం కలుగుతుంది. కులతత్వాన్ని ఖండించబోయి మరోరూపంలో కులతత్వా న్ని ప్రచారంచేస్తున్నారా అనే అనుమానం కలుగుతుంది సామాన్యపాఠకులకు. గత

పాతికేళ్లలో కులతత్వం మన సామాజిక జీవితాన్ని ఎంతగా కలుషితం చేసిందోగుర్తించి నప్పుడు కులవ్యవస్థ విషయంలో జాగరూకత వహించడం అవసరం. కవిరాజుగారి సాహిత్యం ఉద్భవించిన ప్రత్యేక పరిస్థితులనుబట్టి వారి దృక్పథాన్ని అర్థంచేసుకున్నా అంతకన్నా తీవ్రమైన లోపం త్రిపురనేని సాహిత్యంలోని ఆర్య ద్రావిడసిద్ధాంతం.

మనకు తెలిసినంతవరకు వర్ణవ్యవస్థకు ఆర్యులే బాధ్యులు కావడంవల్లా ఆంధ్రులు ద్రావిడభాషల సమూహానికి చెందినవారు కావడంవల్ల యితర అభ్యుదయ రచయితల మాదిరిగానే ద్రావిడ సంస్కృతిని ఆకాశానికిఎత్తడం ఆర్యవ్యతిరేకత చేపట్టడం కవిరాజు సాహిత్యంలోని తీవ్రమైన లోపం. ఈవిధమైన దృక్పథం మానవతావాదానికి విరుద్ధమే కాక మార్క్సిస్టు దృక్పథంకూడా కాదు. కొ. కు. వ్యాసావళిపై యిదేవిమర్శ యిది వరకే నేను ప్రచురించాను (కళాకేళి మార్చి 1971) ఇలాంటి ధోరణులు సంకుచితత్వా నికి దారితీయడమేకాక తప్పుడు సిద్ధాంతాల కవకాశం కల్పిస్తుంది. ప్రతీ దేశచరిత్ర లోనూ వెనక్కి వెళ్లనికొద్దీ ఎన్నోజాతులు సంస్కృతులు చారిత్రిక కారణాలవల్ల చోటు చేసుకోవడం సర్వసామాన్యం. ఏదో ఒక జాతినిగూర్చి అభిమానం ఏర్పరచుకోవడం అభ్యుదయ దృక్పథంకాదు. భారతదేశం విషయంలో యావద్భారతంలోని శ్రమజీవుల ఐక్యతద్వారానే సామ్యవాదం సాధించడంగాని పురోగమించడంకాని సాధ్యంఅవుతుంది. ప్రత్యేకమైన అంశాలను(ఆర్యుల వర్ణసిద్ధాంతం)సంఘటనలను విమర్శించడంవేరు జాతి ద్వేషం చేపట్టడం వేరు. ఆర్యులు రాకపూర్వం ద్రావిడ నాగరికతలో ప్రజారాజ్యం వర్ధిల్లిందనుకుందికి ఆధారాలు లేవు. ఇటీవల పరిశోధనలద్వారా మహెంజోదారోలోనే అంటరానితనం వ్యాప్తిలోఉన్నట్లు అనుమానం యేర్పడింది.

రావణుణ్నిగూర్చి వ్రాస్తూ కవిరాజుగారు హాస్యాస్పదమైన విషయాలు గ్రంథస్థం చేసారు. రావణుడు తెలుగు వ్యాకరణం వ్రాసేడుట (ఖా.పు 1) శివతాండవ స్తోత్రం రావణకృతమంటారు సంస్కృతభాష పుట్టుపూర్వోత్తరాలు తెలిసిన త్రిపురనేని వంటి మహాపండితులే యిలాంటివి నమ్మడం ఆశ్చర్యకరం. ఈ విధమైన లోపాలు సంక్రమించడానికి కారణం భారతీయ సంస్కృతినిగూర్చి, రామాయణ భారతాలనుగూర్చి చర్చించడానికి హిస్టరీ, ఆర్కియాలజీ, ఏంథ్రోపాలజీ వంటి శాస్త్రాలతోను ఆధునిక యుగంలో వెలువడ్డ పరిశోధనలతోను ప్రగాఢమైన పరిచయం అవసరం అని గుర్తించకపోవడం. కేవలం కవులకు పండితులకు యిది సాధ్యంకాదు. ప్రాచీన యితివృత్తాలకు నూతన వ్యాఖ్యానం యివ్వదలచుకుంటే స్వయంకల్పనపై ఆధారపడాలి చారిత్రక వివరణలు అనవసరం. లేనప్పుడు అపసిద్ధాంతాలు బోధించడం జరుగుతుంది. భారత రామాయణాలగూర్చి యిదమిత్థమని చారిత్రిక సిద్ధాంతాలు ప్రతిపాదించడం తేలికైనపని

కాదు. శ్రీకృష్ణుడు చారిత్రికవ్యక్తా? అనే ప్రశ్నపై రకరకాల అభిప్రాయాలున్నాయి. ఇక రామాయణం విషయంలో రాముడికి 8000 భార్యలని జైనులురాసిన కావ్యాలున్నాయి ఇలాంటి విషయాలు చర్చించడంలో ప్రయోజనంలేదు- ఏదైన కొత్తసంగతి చెప్పదలచుకుంటే యథేచ్ఛగా వీటిని వాడుకోవచ్చు.

ఉదాహరణకు ఆర్యులకుపూర్వం ద్రావిడులే యీ దేశంలోని ఆదిమవాసులనుకోవడం పొరపాటు. ద్రావిడులు మధ్యధరాప్రాంతంనుంచి వచ్చినవాళ్లే. ఇన్నాళ్లు ప్రోటో ఆస్ట్రలియాడ్స్ అనే తత్పూర్వులుకూడా ఆ ప్రాంతంవారేఅని నేటి అభిప్రాయం. వీరు కాక మంగోలియను జాతులు. వీళ్ళని కిరాతులన్నారు మనపూర్వులు ఏకలవ్యుడు శ్రీకృష్ణుని జ్ఞాతి కాక కిరాతజాతికిచెంది ఉండవచ్చు (సూ.పు. 4-14) కేవలం వ్యాప్తిలో ఉన్న అభిప్రాయాలు కవిరాజుగారు స్వీకరించారనడానికి యీ క్రింది ఉదహరణలు యివ్వవచ్చు. శ్రీకృష్ణుడు ద్రావిడ నాయకుడని సూచించిన సాయనుడి వ్యాఖ్యానం (ఋగ్వేదం 8-96-13-15) నేటి పండితులంగీకరించడంలేదు. అప్పటికే యితర అర్థాలున్నట్లు సాయనుడే వ్రాక్రుచ్చేడు. సూతపురాణమని పేరుపెట్టడం సూతుడు అబ్రాహ్మణుడన్న భావంవల్లనే. కాని సూతుడనేది ఒక్కవ్యక్తి మాత్రమేకాదు. సూతులనేది మగధవాసుల్లో ఒక తెగకు పేరుట.

పై అంశాలు వివాదాంశాలు కావచ్చు. కాని వీటితోపాటు మరో ముఖ్య లోపం కూడా కన్పిస్తుంది- ఒకవైపున ప్రాచీనసంస్కృతిని విమర్శిస్తూనే మరోవైపున

'ఆదికాలమునుండి యార్యుల కెయ్యది
పరమ పవిత్రమై పరగుచుండు' (సూ.పు. 1-35)

అని 'గంగాభవాని'కి కవి ప్రయాణంలో మొక్కించడం పదే పదే సాంప్రదాయంపై భక్తిశ్రద్ధలు కనపరచడంవల్ల కావ్యంలో ఐక్యత లోపిస్తుంది. శ్రీకృష్ణుని విషయంలో ఒకమూల పొగడడం, మరోవైపున విమర్శించడం పాఠకులను తికమకలు పెడుతుంది- శ్రద్ధగా చదవవలసిన మరో అంశం స్త్రీ పురుష సంబంధాల విషయం. సెక్స్విషయం త్రిపురనేనివారి భావాలు గజిబిజిగా ఉన్నాయి- సెక్స్పై ఆంధ్రదేశంలో యీనాటికి కూడా అభ్యుదయవర్గాల్లో నిర్దుష్టమైన దృక్పథం లేకపోవడం యిటీవల సూచించేను. (వసుధ 1971 దీపావళి సంచిక) ఇలాంటి లోపాలున్నా కవిరాజు మనందరకు మార్గదర్శకుడు.

సాహిత్య లేఖలు :

# తిరోగమన 'చైతన్యధార'

చైర్మన్ మావో కళలు సారస్వతంగూర్చి ఇలా అన్నారు.

The first Problem is: literature and art for whom?

This Problem was solved long ago by Marxists, especially by Lenin. As far back as 1905 Lenin Pointedout emphatically that our literature and art should "Serve...the millions and tens of millions of Working People."

'చైతన్యధార' అనే విప్లవ రచయితలగూర్చి వ్యాసం. ధార గూర్చి సమీక్షపైన ఉదహరించిన భావానికి భిన్నమైనది. అంతేకాక యీ సమీక్షవ్యాసంఅంతా మార్క్సిజం ముసుగులోఉండి ప్రభుత్వాన్ని తిడుతూ విప్లవాన్ని సమర్థిస్తున్నట్లు కనిపిస్తూనే, విప్లవ భావాలకు వ్యతిరేకపాత్ర వహించింది.

"కాని వి.ర.సం. పేరుతో మరో సంఘాన్ని నెలకొల్పడంవల్ల నాలాంటి వాళ్ళకి చాలా అనుమానాలున్నాయి. అసలు రచయితలకు కవులకు సంఘాలు అవసరమా అని నాప్రశ్న."

యస్.వి యస్. రావుగార్కి మొదట్లోనే చుక్కెదురైంది. ఐనా విప్లవ రచయితలను సమర్థించడమే తమ బాధ్యత ఉద్దేశము అంటారు. కాని వి ర.సం ఆవిర్భవించిన ఇన్నాళ్లకుకూడా దాని అవసరం ఏమిటో వారికి గోచరించడంలేదు. మాట్లాడితే మార్క్స్ 1844 మ్యాన్‌స్క్రిప్ట్స్ (కళ-5, సృజన-39) ఏకరువు పెడతాడేగాని 1967 నుండి దేశంలో ఏంజరుగుతుందో రావుగారికి తెలియడంలేదు లాగుంది.

తెలంగాణ వీరోచిత పోరాటం (1946-51) ఎలా ప్రజల్లోంచి విప్లవకారుల్లోంచి రచయితల్ని కళాకారుల్ని సృష్టించుకున్నదో నగ్జల్‌బరి శ్రీకాకుళం పోరాటాలుకూడా అలాగే తమ కవులను కళాకారులను సృష్టించుకున్నాయి. అది ఒక ఆంధ్రదేశంలోనే కాక దేశం నలుమూలలా సాహితీశక్తులను కూడగట్టుతుంది. ఇది చారిత్రిక సత్యం. "కవిత్వం కళ యిత్యాదులు సృజనాత్మక వ్యాసాంగాలు కాని సమిష్టి వ్యాపారాలు కావు. కవిత్వాన్ని సంఘాలు రాయవు, కవులు రాస్తారుగాని.- ఫైళ్లు, చందాలు, సభలు సమావేశాలు, తీర్మానాలు సాహిత్యసృజనకు అనవసరం కాదుకదా హానికరంకూడా." పై వాక్యాలు చారిత్రక వివేచనారహితంగానూ, హాస్యాస్పదంగానూ గోచరిస్తాయి రావు

గారన్నట్లు కవిత్వాన్ని మాత్రం వ్యక్తులే వ్రాస్తారు. సమాజం కోసమే వ్రాస్తారు. అది పుస్తకాలద్వారానే జరగాలి. సకల సమావేశాలద్వారా సాహిత్య సృజన దెబ్బతింటుందనడం జడాత్మకవాదం. (డాగ్మాటిజం)

"విప్లవ రచయితల సంఘం ఉద్దేశ మేమిటి? కవులమధ్య విప్లవమా? కవిత్వంలో విప్లవమా? లేక కవిత్వం ద్వారా విప్లవమా?"

విప్లవ రచనలగురించి రచయితల గురించి రచయితల సంఘం గురించి ఇలాగ అనేకానేక సందేహాలున్నాయి రావుగారికి—

విప్లవ రచయితల (సంఘం) ఉద్దేశం ప్రత్యేకంగా మళ్ళీ చెప్పనక్కర్లేదు. వి.ర సం ఎందుకు? అన్నప్పుడే దానికి సమాధానం ఇవ్వబడింది. ఇక—

'కవులమధ్య విప్లవమా?' అవును. కవులమధ్య విప్లవమే! బూర్జువా రచయితల రచనలను బద్దలుకొట్టడంకూడా విప్లవ రచయితల ఉద్దేశాలలో ఒకటి

'కవిత్వంలో విప్లవం ఉండనేఉంది గ్రహించే స్తోమతఉంటే!'

'కవిత్వంద్వారా విప్లవమూ' నిజమే. విప్లవ రచయితలు కవులు ప్రజల్లోకి వెళ్ళి విప్లవానికి భూమికను తయారుచేస్తారు. కవిత్వంద్వారా రచనలద్వారా విప్లవం వస్తుందా? అని సంకుచితంగా ఆలోచించడంకంటే, గేలిగా వ్రాయడంకంటే విప్లవంలో సాహిత్యం కూడా ముఖ్యపాత్ర వహిస్తుందని గుర్తించడం మంచిది.

ఐతే 'కవులమధ్య విప్లవమే' ముఖ్యంగా కనిపిస్తుందట రావుగారికి. అది ఆయన దృష్టిలోపం అక్కడక్కడ విప్లవరచయితలంటే ఇష్టమైనట్లే వ్రాసినా, విప్లవరచనలను రచయితలను ఖండించడమే ముఖ్యంగా మనకు కనబడుతుంది. రావుగారికి విప్లవరచనలలో ముఖ్యంగా కవిత్వంలో సహజత్వం శైలి మృదుత్వం మధురం గోచరించడంలేదు. అందువల్ల ఆయనకు బాధ కలగడమూ సహజమే! కొన్ని అలవాట్లుపడి, కొన్నిగీతలు గీసుకొని దేన్ని పరిశీలించినా ఈరకమైన బాధలు తప్పవు.

ఏది ఏమైనా రావుగారి వ్యాసం (సమీక్ష) మార్క్సిజం పేరుతోనే, లెనిన్ కొటేషన్స్‌తోనే, విప్లవం అంగీకరిస్తున్నట్లుగానే విప్లవ రచయితలపై కొత్తరకందాడి ప్రారంభించారు. విప్లవ వ్యతిరేకశక్తులను మనం అర్థంచేసుకోగలం. వారు విద్రోహం తల పెడితే మనం ఆశ్చర్యపోం! కాని- అంగీకరిస్తూ అంగీకరించని, అభిమానిస్తూ అభిమానించని వింతరకమైన, విచిత్రకరమైన సరికొత్త (రకం) రాతలు ఆ వ్రాతల వెనుక భావం అర్థం చేసుకోవడం కొంచెం కష్టమే!

వాటిని సరిగా అంచనావేయకపోతే, మనవాళ్ళె అనుకొని (సృజనలో ప్రచురించి నట్లుగా) బోల్తాపడే అవకాశం ఉంది.

'ధార' కవితా సంకలనం విషయంలో— కొన్ని అధికవర్ణనలు క్లుప్తతను కవిత్వ విలువలను దెబ్బతీస్తాయనే రావుగారి అభిప్రాయంతో మాకు పేచీలేదు.

'అభ్యుదయపరులకు విప్లవకారులకుకూడా భూదేవి మాతృదేవత' అనే సెంటి మెంటు—

'మానవత్వాన్ని పరిభోదించే నిజాయితీగల కవులు'

"భూదేవి యోని పుండులో రసిలా

క్యూలో కూరుకుపోయిన

బండలైన బ్రతుకుల్లో"

అని రాయడం 'హీనకృత్యం'—అనడాన్ని మాత్రం తీవ్రంగా నిరసిస్తాం.

సామాన్యుడు క్యూలో తిండిగింజలకొరకు పడే యాతనచూసి కవి తనకనుగుణ మైన తీవ్రస్థాయిలో భావవ్యక్తీకరణ చేయబూనడంలో తప్పేమిటి? అశ్లీలంఅంటారు. కవి తీవ్రతనుబట్టి రాయబూనడం అశ్లీలం అనిపించుకోదు—

ఏవోకొన్ని పనికిమాలిన నీతులు, మూఢనమ్మకాలు పెట్టుకొని ఇదివరకుగాలిని అగ్నిని దేవతలుగా చేసిందిచాలక, ఇప్పటి 'మార్క్సిస్టులు'మళ్ళీ భూమిదేవతగా, పవి త్రమైన దానిగా మార్చాలా?

అదీకాక— "అసలు విప్లవం దేనికి ఏఉన్నతస్థాయిలో తిండికా? లేక మానవుడు యేర్పరుచుకున్న విలువలను కాపాడుకుందికా?" అనటం చిరెత్తి చిందులువేసినట్లు కన బడుతుంది తప్ప శాస్త్రీయ అవగాహన కనబడదు. మార్క్సిజం దాగ్మా కాదనుకున్న ప్పుడు— ఈ ఆచారాలు గోచారాలన్నీ శాశ్వతమైనవికావని గుర్తించాలి. 'పంచాదినిర్మల' అనే కవితలో భావైక్యత లోపించిందని— అది నిజమోకాదో యింకో విప్లవ సమీక్షకుని కలంనుండి సమీక్ష వెలువడితేగాని తెలియదు (ఎందుకంటే ఇదే కవిత మంచికవితగా అనేకానేక సాహితీమిత్రులు అభిప్రాయపడ్డారు)

అందరూ మహానుభావులే! అన్నట్లుగా అందరూ మార్క్సిస్టు విమర్శకులే!!

ముసుగులు తొలిగితేగాని రంగు బయటపడదు.

ఆఖరుగా— "కాని ప్రధానంగా సాహిత్యం, అందులో ముఖ్యంగా కవిత్వం, విద్యావంతులను కవిత్వంపై అభిరుచిఉన్న సహృదయులను ఆకర్షిస్తుందనీ అందుకుతగిన పటుత్వం కవిత్వానికి అవసరమని గుర్తించడం మార్క్సిజానికి విరుద్ధం కాదు. కళా సాంప్రదాయాలను, ప్రమాణాలను పూర్తిగా త్రోసిరాజనడం సాధ్యంకాదని యీనాడు సోవియట్ విమర్శకులే గుర్తిస్తున్నారు"

ఈపేరాచదివితే తెలంగాణ పోరాటం కాలంనాటి ఒకపాట గుర్తువస్తుంది.

"రింగు రంగులమారి నెవురయ్యో

నీ రంగు బైరంగమాయె నెవురయ్యో."

— ఆర్ట్‌లవర్స్.

# సృజన కవితలు - అధి వాస్తవికత

ఆధునిక సాహిత్యవేదికగా విప్లవకవితా దర్పణంగా సృజన నేటి తెలుగు సాహిత్యంలో ప్రముఖస్థానం నిర్వహించుకోంది. రాబోయే యుగసాహిత్యానికి వైతాళికుడుగా నిలుస్తోంది.

ఇంత ప్రాధాన్యత వుండటంచేత బాధ్యతాయుతంగా సాలోచనగావుండాలి నిర్వాహకులు అపుడపుడు వెనక్కి తిరిగి ఆత్మవిమర్శతో పరిశీలనచేసికొంటూ, లోపాలు దిద్దుకుంటూ కొత్తపాఠాలు నేర్చుకుంటూ అందుకు అవుసరమైనంత మేరకు అభిప్రాయాలు సేకరిస్తూవుండాలి

యాధాలాపంగా ప్రవాహంలో కొట్టుకుపోవటముగా వుండకూడదు.

ఆ దృష్టితో ఒక అంశం చర్చించటం యిక్కడ నా వుద్దేశం.

'సృజన' కవితల గురించి

బహుముఖాలది ప్రజాజీవితం
అనేకానేక అనుభూతులు, బాధలు. భయాలు.
ఉద్రేకోత్సాహాలు ప్రజల జీవితాలలో

నిజాయితీగల నిశితదృష్టిగల కవులు ప్రజాకవులు ప్రజల జీవితాల అనేక కోణాలను అర్థంచేసుకొని అనుభవాలలో పాలుపంచుకొంటూ ఆ అనుభూతులకు స్పందిస్తూ అందునుండి ఒకదారి ప్రజలు నడవాల్సినదారిని స్పష్టంగా చూపుతూ, ఆ దారికి నడపగల్గేలా నచ్చేరీతిగా వుండాలి విప్లవ ఆగామిక విత్వం.

ఆ కృషి ఏమీ సృజన కవితల్లో కన్పించదు–

జీవితాన్ని గురించి లోతయిన చర్చగాని వివిధరకాల ప్రజల అనుభవాల సహానుభూతిగాని సమాజవ్యవస్థలోని ఎదురు వివిధరూపాల పరిశీలనగాని, మామూలు ప్రజలు ఏ వర్గంవారినైనా పరిశీలనలోపడవేసే కదల్చే నచ్చజెప్పేవిధానంగాని సృజన కవితలలో కనిపించటంలేదు.

కేవల రాజకీయం- అందునా ఒకే సింపుల్ విధానం. (కత్తి) శత్రువును హత్య చేయటం. కసి, బద్మాష్ యిదే యీ అత్యల్పమైన థీమ్ మాత్రమే పునః పునః ప్రవచించబడుతూ దాదాపు అదే రచయితల అవేశావాల్ని ప్రతిబింబించడంగా జరుగుతున్నది.

ఈ గేయాలు మంచివికావని కాదు.

జీవితసత్యాలు వేయిలో
జీవితవిముక్తి పోరాటాల శతంలో

యీ గేయాల భావంకూడా ఒక అంశంగా సబబే. కాని అదే సర్వమూ, ఆ కవిత్వమే సర్వ కవిత్వమూగా సృజన ప్రతిబింబించుతోంది.

పోనీ, అదయినా నిజంగా దేశపరిస్థితుల్లో వాస్తవానికి దగ్గరగా వున్నదాఅంటే లేదు. ఎక్కడో ఎప్పుడోజరిగే ఒకటి, అరా సంఘటనలే దేశంలోవున్న వాతావరణంగా ప్రతిబింబించే కవిత్వమవుతున్నది అది సరైన విప్లవ కవితగా ఎంచ వీలులేదు. మరి అది మహోత్తమ, విప్లవ కవిత్వంగా తీసుకురాబడుతున్నది.

ఉదాహరణకు యీ సంచిక(డిసెంబరు 72)లోని మూడు కవితలూ పరిశీలిద్దాం.

నా తలను తీసినా, ప్రజలు ...

నా చేయి నువు నరికినా ప్రజలు ...... చేస్తారు

వగైరా, ఇది మంచి ఆశయమే కాని వాస్తవానికి చాలా దూరంగావుంది.

కీచకవధ– కీచకుణ్ణి చంపటంవలెనే భూస్వాములను వ్యక్తులుగా చంపేయాలన టం వరకైతే అది గొప్ప విప్లవదృష్టేకాదు, గొప్ప కవిత్వం అంతకన్నాకాదు. కాని యిదే విప్లవదృష్టి అదే విప్లవ కవిత్వం అన్నట్లు సృష్టించే యిప్పటి సృజన పొరబాటు దృష్టికీ అవగాహనాలోపానికీ నిదర్శనం మాత్రమే.

ఇంత మంది విప్లవ రచయితలు విద్యార్థులు వగైరాలువుంటే "మావోమతమే తమ మతమని, శ్రామికకులమే తమ కులమని, బొగ్గుట్టలలో పనిచేస్తున్నానని"వగైరా నిజంగా భావనజేసే తత్వం శతాంశంకూడా వాస్తవికంగాలేదు. బడాయిలు చెప్పుకోవ టం, లేనిపోని ఆచరణలోలేని కోతలు కోయటమే ప్రజాకవిత్వమని నేననుకోను.

మాటిమాటికీ శత్రువును బద్మాష్అని తిట్టటాలూ, ప్రతివారినీ రెనెగేడ్ అనటా లూ మాత్రమే కత్తిపట్టు శత్రువును చంపు అనేదిమాత్రమే ఆధునిక సాహిత్యం అంటే నాకు మంచిగా అనిపించటంలేదు.

ఇంకా ఆలోచించండి. జీవితం చాలా లోతయినది. విశాలమైనది. భారత ప్రజల జీవన పరిస్థితులు ఆరాటాలు బాధలు పోరాటాలు చాలా విశాల విస్తారంకలవి. ఈ ఆరాట పోరాటాల సారంయొక్క దర్పణంగా నిజమైన ఆధునిక సాహిత్య వేదికగా విశాల భాగాల్లోని కోట్లాది ప్రజల జీవన పోరాటాల బహుముఖ ప్రతిస్పందనగా వాస్తవ చిత్రణగా వుండాలి సృజన కవిత.

నేటిది అది వాస్తవ కవితగావుంది

ఈ అధివాస్తవికతను, ఎవరికో ఆ ప్రవాహంలోవున్న నల్గురకు మాత్రమే వాణిగా వుండటాన్ని విడిచిపెట్టి, ప్రజలను కనీసం మధ్యతరగతి ప్రజలనయినా ఎడ్యుకేట్ చేసేదిగా ఆధునిక తెలుగు రచయితల వేదికగా ప్రజల్ని దృష్టిలో వుంచుకొని రాసే రచయితల వాణిగా సృజనను తీసుకురాగోర్తాను.

పాడిందే పాటగా, అదేకత్తిని పదిసార్లు గాలిలో మాత్రమే త్రిప్పటంగా విప్లవ కవిత్వాన్ని దిగజార్చటం విరమించి ప్రజా విప్లవోద్యమ దీర్ఘయాత్రా సీరియస్‌నెస్‌కు అంకితమవాలని....

— ఒక పాఠకుడు

**SRJANA Telugu Monthly** **Jan. '73** **H-1088**
Regd. No. with Registrar of News Paper 10953/67

# ప్రస్తుతం సృజన దగ్గర అమ్మకానికి సిద్ధంగావున్న పుస్తకాలు

| | పుస్తకం | రచయిత | వెల |
|---|---|---|---|
| 1. | తెలంగాణ పోరాట పాటలు | | రు. 1—00 |
| 2. | నాంది నాటకం | గంగిరెడ్డి | 1—00 |
| 3. | జనసేన పాటలు | జనసేన | 1—00 |
| 4. | కవిత్వం-చైతన్యం | త్రిపురనేని మధుసూదనరావు | 1—50 |
| 5. | ఎర్రపిడికిలి | కె.వి. రమణారెడ్డి | 3—00 |
| 6. | గెరిల్లా | విప్లవ గీతాలు | 1—00 |
| 7. | నాకుటుంబం నవల | టావ్ చెంగ్ | 2—00 |
| 8. | భారతీయ తత్వశాస్త్రం-ఒక పరిశీలన | నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు | 1—00 |
| 9. | కళ | సంపాదకుడు-చలసాని ప్రసాదరావు | 5—00 |
| 10. | మహోదయం బుర్రకథ | కానూరి వెంకటేశ్వరరావు | 1—00 |
| 11. | రక్తగానం కవితాసంకలనం | చైతన్యసాహితి, అనంతపూర్ | 1—00 |
| 12. | తూర్పుగాలి | నగ్నముని | 3—00 |
| 13. | సమరం | సంకలనకర్త-అగ్నిమిత్ర | 1—00 |

ఇప్పుడే అందిన విరసం తాజా ప్రచురణ

అ.ర.సం కాయకల్ప చికిత్స: కె.వి. రమణారెడ్డి 1—25

SRJANA
HANAMKONDA
Warangal 506001

1 Re.